# మార్షల్ టిటో



రచన:

వాశిరెడ్డి భాస్కరరావు



ప్రజాప్రచురణాలయం,
నారాయణగూడ, హైదరాబాదు (దక్కన్.)

# మనవి



టిటో అసలు పేరు జోసెఫ్ బ్రాజ్. అజ్ఞాతవాసంలో ఉండి ప్రజా ఉద్యమాన్ని నడిపే రోజుల్లో పెట్టుకున్న పేరు టిటో. చిన్నప్పుడు కొలిమి తిత్తులు ఊదుకొనే ఈ కమ్మరిబిడ్డ నేడింత మహానాయకుడు యెలా అయ్యాడు ? ఈ విషయాన్నే ఈ చిన్న పుస్తకం తెలియపరుస్తుంది. "సామాన్య రైతు కార్మికుల్లోనుంచి కూడా మహానాయకులు తయారవుతారు." అనడానికి టిటో జీవితం ఒక చక్కని ఉదాహరణ.

టిటో అనేకసార్లు తిండిదొరక్క పస్తులు పండుకున్నాడు. కష్టపడి కూలి చేశాడు. అనేక దక్కా మొక్కీలు తిన్నాడు. కూలీల కష్టాలు కండ్లారా చూశాడు. స్వయంగా అనుభవించాడు. స్వానుభవంద్వారానే సంఘబలాన్ని గుర్తించాడు. కార్మిక సంఘాన్ని నిర్మించాడు. మొదటి ప్రపంచ మహాయుద్ధంలో సైనికుడుగా ఉండి హోరాహోరి పోరాడాడు. రష్యాలో ఏర్పడిన రైతు కూలీరాజ్యాన్ని కాపాడడానికి తన సర్వశక్తులు ఉపయోగించాడు. తన మాతృభూమి యుగోస్లేవియా స్వాతంత్ర్య సంపాదనార్థం తన జీవిత సర్వస్వం ధారవోశాడు. సఫలుడయ్యాడు. ప్రపంచ ప్రజాస్వామికవాదులందరికి నేటి స్వతంత్రయుగోస్లేవియా ఒక ఆశాజ్యోతి లాగా కన్పిస్తూంది. ఇంతటి మహత్కార్యాన్ని సాధించిన టిటో జీవిత విశేషాల్ని — బాల్యంనుంచి నేటివరకు — తెలుసుకోవాలని ప్రతివ్యక్తి — ముఖ్యంగా ప్రతి యువకుడు కుతూహలపడతాడు. అది సహజం ఈ ఉద్దేశంతోనే ఈ చిన్న పుస్తకం రాయబడింది.

వివిధ జాతులతో వివిధభాషలతో భారత రాజకీయ సమస్యలాగే చిక్కు చిక్కుగా ఉన్న యుగోస్లేవియా స్వాతంత్ర్య సమస్యని టిటో ఏవిధంగా పరిష్కరించాడో ఈ పుస్తకం తెలియజేస్తుంది.

మైకేల్ పెడేవ్ యుగోస్లేవియావెళ్ళి అక్కడి పరిస్థితుల్ని స్వయంగా చూశాడు. టిటోతో కలిసి మాట్లాడాడు.

ఇంగ్లీషులో " మార్షల్ టిటో " అనే ఒక చక్కని పుస్తకాన్ని కూడా రాశాడు. ఈ పుస్తకాన్ని ఆధారం జేసుకొనే టిటో జీవితవిశేషాలు రాశాను. ఇందుకు ఆ గ్రంథకర్తకు ఎంతో కృతజ్ఞుణ్ణి. ఈ పుస్తకంతో పాటు ఈ దిగువ నుదహరించిన పుస్తకాలు పత్రికలు కూడా చాలా తోడ్పడ్డాయి.

1. The Liberation of Yugoslavia Littoral
2. Yugoslavia Liberated
3. Spot Light on Yugoslavia
4. The March of Yugoslavia
5. Yugoslavia Partisans
6. యుగోస్లేవియా స్వాతంత్ర్యపోరాటం

## పత్రికలు

New Times
News and Views
People's Age

— వాసిరెడ్డి భాస్కరరావు

# కమ్మరిబిడ్డ మహానాయకుడు

యుగోస్లేవియాదేశం భారత దేశంలాగే ఒక ద్వీపకల్పం. నల్ల సముద్రం తీరానఉన్న బాల్కాన్ దేశాల్లో యుగోస్లేవియా కూడా ఒకటి. ప్రపంచ రాజకీయాల్లో బాల్కాన్ దేశాలు ఎప్పుడూ ఇక గొప్ప కీలక స్థానాన్ని ఆక్రమించాయి. ప్రపంచాధిపత్యం కొరకు యుద్ధాలు సాగించే సామ్రాజ్యవాదు లందరూ ముందు ఈ బాల్కాన్ ప్రాంతాలమీద అధికారం సంపాదించడానికి విశ్వప్రయత్నాలు చేసేవారు. 1600 నాటికి బాల్కాన్ దేశాలన్నిటి మీదా టర్కీ సామ్రాజ్యం ఆధిపత్యం వహించింది. టర్కీని బాల్కాన్ దేశాలనుంచి వెళ్ళగొట్టి తన పలుకుబడికిందికి తెచ్చుకోవాలని రష్యన్ జారు చక్రవర్తి టర్కీతో అనేక యుద్ధాలు చేశాడు.

ప్రథమ ప్రపంచ మహాయుద్ధ ఫలితంగా టర్కిష్, రష్యన్, ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యాలు విర్మూలించబడ్డాయి. శిథిలమైన ఈ సామ్రాజ్యాల్లోనుంచి కొత్తదేశాలు బయలుదేరాయి. ఈ కొత్తదేశాల్లో యుగోస్లేవియా కూడా ఒకటి. దీనికి ముఖ్యపట్టణం బెల్గ్రేడ్.

యుగోస్లేవియా వైశాల్యం 95 వేల చదరపుమైళ్ళు. జనసంఖ్య ఒక కోటి 40 లక్షలు. వీరిలో సెర్బియన్లు 65 లక్షలు, క్రోట్లు 40 లక్షలు, స్లోవనీస్ ప్రజలు 10 లక్షలు, హంగేరియన్లు 5½ లక్షలు, జర్మన్లు 3 లక్షలు మిగిలిన వారిలో అల్బేనియన్లు, బల్గేరియన్లు, మాసిదోనియన్లు, మొదలైన అనేక జాతులవారున్నారు.

మన భారతదేశం మాదిరిగానే యుగోస్లేవియాలోని ప్రధానసమస్య జాతుల సమస్యయే. అనేక జాతులకు చెందినవారు ఉండడంవల్ల యుగోస్లేవియాలో జాతుల సమస్య ప్రాధాన్యత వహించింది. అధిక సంఖ్యాకులైన సెర్బియన్ల ఆధిపత్యంకింద జాతి విభేదాలు, వైషమ్యాలు, అనేక రూపాల్లో తలెత్తుతూ ఉండేవి. సెర్బియన్లకంటె జనసంఖ్యలో తక్కువైనా క్రోట్లు మిగిలిన అన్నిజాతుల వారికంటె సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక విషయాల్లో చాలా ముందున్నారు. జన సంఖ్యలో నూటికి 80 మంది

క్రోట్లు. క్రోట్ జాతీయోద్యమం బాగా అభివృద్ధి చెందింది. యుగోస్లేవి యాలో 15 లక్షల మంది మహమ్మదీయులు కూడా ఉన్నారు. సర్బో-క్రోషి యన్ వీరి మాతృభాష.

రాజ్యాంగాధికార విషయంలో క్రోట్లకు సెర్బియన్లకు ఎప్పుడూ తగాదాలు వస్తూఉండేవి. రాజులు సెర్బియన్ జాతికి చెందినవారు. క్రోట్ రైతాంగ పార్టీ నాయకుడైన రాడిష్‌ను యుగోస్లావ్ పార్లమెంటులో ఒక సెర్బియన్ సభ్యుడు కాల్చి చంపేశాడు.

దీన్ని అవకాశంగా తీసుకొని అలెగ్జాండర్ రాజు వెంటనే (1929) పార్లమెంటును రద్దుజేశాడు. అధికారాలన్నీ తన చేతిలోనే అట్టిపెట్టు కున్నాడు. రాజకీయ పార్టీలన్నిటినీ నిషేధించి యుగోస్లేవియా దేశమంత టికి తానే నియంత అయ్యాడు.

ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. 1934 లో అలెగ్జాం డర్‌రాజు ఫ్రాన్సును దర్శించడానికి వెళ్ళినప్పుడు ఒక మాసిడోనియన్ దేశ భక్తుడు రాజును కాల్చివేశాడు. అలెగ్జాండర్‌రాజు కొడుకైన పీటర్ అప్పుడు 11 సంవత్సరాల పిల్లవాడు. పీటర్ మైనరు అయినందువల్ల రాజకీయ వ్యవహారాలన్నీ అతని దగ్గిరబంధువైన పాల్ చూస్తూఉండేవాడు.

1939 వచ్చేసరికి యూరప్ రాజకీయాల్లో పెద్ద మార్పువచ్చింది. హిట్లరు దండయాత్రలు ఆరంభమయ్యాయి. 1941 ఏప్రిల్ 6 వ తేదీ తెల్లవారు ఝామున నాజీ విమానాలు మిడతల దండులాగా వచ్చి బెల్గ్రేడ్ పట్టణంమీద బాంబులవర్షం కురిపించాయి. వారంరోజుల్లో యుగోస్లే యానంతా నాజీరాక్షసులు సునాయాసంగా ఆక్రమించుకున్నారు. ప్రభుత్వం కాలికి బుద్ధిచెప్పింది. దేశం సుభిక్షంగా ఉంటే ఈ మహారాజులు ప్రజల్ని దోచుకోడానికి తయారు. ఏదైనా హెచ్చుతగ్గులువస్తే అందరికంటె ముందే పలాయన మంత్రం పఠిస్తారు. యుగోస్లేవియా ప్రభుత్వంకూడా ప్రజల్ని భయంకర నాజీరాక్షసి వాతబడేసి తనదారి తాను చూసుకుంది. ఎన్నో సంవత్సరాలనుంచి ప్రజల రక్తమాంసాలు పీల్చి పిప్పిచేసి నింపిన బొక్కసాలతో హాయిగా లండన్ రాజభవనాల్లో కాలుమీద కాలేసుకొని

కూర్చొని కబుర్లతో కాలక్షేపం చేయసాగింది. అయితే ఇక ప్రజలగతి ఏమిటి? ప్రజలు రాజులవలె పిరికి పందలుగారు. తన కడుపే కైలాస మనుకునే రాజులవలె ప్రజలు స్వార్ధపరులుగారు. ప్రాణం పోయినాసరే ఫాసిస్టుల్ని ఓడించి తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవాలి అనుకున్నారు. విజయమో వీరస్వర్గమో తేల్చుకోవాలి అనుకున్నారు. ఫాసిస్టులకింద బానిసలై నీచపు బ్రతుకు బ్రతికేదానికన్నా పవిత్ర స్వాతంత్య్ర పోరాటంలో ప్రాణాలర్పించడమే పరమాదర్శమని ప్రపంచ ప్రజలందరికి ఒక దివ్య మైన మార్గాన్ని చూపెట్టారు. అవును, "ముహూర్తం జ్వలితం శ్రేయం నతు ధూమాయతం చిరం"

ప్రజల్లో ఒక నూతనోత్సాహం పొంగిపొరలింది. బొందిలో కొన ఊపిరి ఉన్నంతవరకు తెగించి యుద్ధంజేయడానికి సిద్ధమయ్యారు. కాని, ఆధునిక మారణ యంత్రసామగ్రితో, అసంఖ్యాకసైన్యంతో, ప్రళయకాల రుద్రుడులాగా విజయ గర్వోన్మాదంతో వికటాట్టహాసంచేసే హిట్లర్ని ఎదిరించడం ఎలా? కోరికఉంటే మార్గం లేకపోతుందా? కొడవలి, గొడ్డలి దగ్గిరమంచి చేతికందిన ప్రతి ఆయుధాన్ని తీసుకున్నారు. గెరిల్లా యుద్ధానికిదిగారు. చెట్టు కొకడు పుట్టకొకడు చొప్పున మాటువేసి హిట్లరు సైనికుల్ని హతమార్చసాగారు. నాజీ సైనికుల్నిచంపి వాళ్ళదగ్గిర ఉన్న క్రొత్తకొత్త ఆయుధాల్ని సేకరించారు. మూడుపువ్వులూ ఆరుకాయలుగా గెరిల్లాసైన్యం దినదినాభివృద్ధినందింది. స్త్రీలు, పురుషులు, రైతులు, కూలీలు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, యువకులు, వృద్ధులు తండోప తండాలుగా వచ్చి గెరిల్లా సైన్యంలో చేరిపొయ్యారు. ఏనాటినుంచో పరం పరాగతంగా వస్తూన్న కులమత ద్వేషాన్ని మరచిపొయ్యారు. తిండీ తిప్ప లున్నయ్యా? లేవా? అనేసమస్య లేనేలేదు. వస్తువులపండుకొన్నారు. విశ్రా ఘోరాలు మానారు. కష్టనష్టాల్ని సరకుచెయ్యలేదు. అడవుల్లో, కొండల్లో తలదాచుకున్నారు. ఎండలకీ వానలకీ లక్ష్యంచెయ్యలేదు. తేళ్ళూ ముళ్ళూ వాళ్ళ కంటి కగపడలేదు. నాజీ రాక్షసుల్ని హతమార్చడమే వాళ్ళలక్ష్యం. పరమ పవిత్రమైన మాతృభూమిస్వాతంత్ర్యాన్ని సాధించడమే వారి ఆదర్శం.

తల్లికడుపు చెడబుట్టి చీడపురుగులు, దౌర్భాగ్యులు, కొందరు అక్కడకూడా దాపురించారు. హిట్లరు అడుగులకు మడుగులొత్తే కొందరు తొత్తులు, దేశభక్తులు అనే బురఖాతో కొంత దొంగనాటకం ఆడసాగారు. మిహిలోవిచ్, నెడిచ్, పావెలిచ్ మొదలైన దేశద్రోహులు వెన్నుపోటు పొడిచారు. గెరిల్లా సైన్య నాయకుడైన మార్షల్ టిటోని ఒక బందిపోటు దొంగఅని ప్రచారంచేశారు. బ్రిటిష్ అమెరికన్ సామ్రాజ్యవాదులు దీనికి తానా అంటే తంథానా అని వెనకతాళం వేశారు. ఎన్నికష్టాలువచ్చినా లెక్క చేయకుండా మొక్కవోవని ధైర్యసాహసాలతో అచంచల విశ్వాసంతో వాటి అన్నిటిని ఎదుర్కొన్నారు. ఒంటరిగా నిల్చి 40 డివిజన్ల ఫాసిస్టు సైన్యాన్ని ఎదిరించి యుద్ధంజేశారు. 1 లక్ష 70 వేల మిహిలోవిచ్ సైన్యానికి బుద్ధిజెప్పారు. రెండు లిపులు, రెండుబాషలు, మూడుమతాలు, ఆరు జాతులతో నానా గోత్రీకృంగా ఉన్న యుగోస్లేవియా ప్రజలందర్నీ ఏకబాటన ఏకథాటిగా నడిపించారు. పీడిత ప్రజలందరికి ఒక నూతన ఆశాజ్యోతిని చూపించారు.

1941 జూన్ 22 వ తేదీన సోవియట్ రష్యాకూడా హిట్లరుమీద యుద్ధం ప్రకటించింది. దీనితో యుగోస్లేవియా ప్రజల్లో ఉత్సాహం ఇంకా ఇనుమడించింది. నాజీసైన్యానికి ఊపిరి ఆడకుండా గెరిల్లాసైన్యం దెబ్బ మీద దెబ్బ కొట్టింది. మిహిలోవిచ్ గుట్టు బట్టబయలు అయింది. ప్రజల కష్టం ఫలించింది. విజయలక్ష్మి యుగోస్లేవియా వీరుల్ని వరించింది. ప్రజా స్వాతంత్ర్యానికి ప్రబల విరోధి అయిన చర్చిల్‌కూడా మార్షల్‌టిటోని అద్భుతంగా శ్లాఘించాడు. యుగోస్లేవియా కంతటికీ కామ్రేడ్ టిటో ఒక్కడే యేకైక నాయకుడని ఇటీవల జరిగిన ఎన్నికలు స్పష్టంగా రుజువు చేశాయి. ఎవరీ మహానాయకుడు ? ఇతని జీవిత విశేషాలేమిటి ? చిన్నప్పుడు కొలిమి తిత్తులు ఊదుకొనే ఈ కమ్మరిబిడ్డ నేడింత మహా నాయకుడు ఎలా అయ్యాడు ? తర్వాత అధ్యాయాల్లో వివరంగా తెలుసు కుందాం.

---

# బాల్యం

క్రోషియా ప్రాంతానికి జాగ్రెబ్ ప్రధానపట్టణం. ఆ పట్టణానికి సమీపంగా ఉన్న జగోరీ జిల్లాలో టిటో జన్మించాడు. యుగోస్లేవియాలోని ఇతర ప్రాంతాలకన్న నాగరితలో క్రోషియా ప్రాంతం ఒక అడుగు ముందుంది. అయినప్పటికి టిటో స్వగ్రామం అయిన క్లాన్యెట్స్ పేదరికానికి పెట్టినపేరు. ఎప్పుడూ దరిద్రదేవతతాండవిస్తూ ఉంటుంది. కొంచెం పచ్చపచ్చగా ఉండే కుటుంబాలే విప్పచ్చరంగా ఉంటే ఏపూట కాపూట రెక్కలాడితేగాని డొక్కలాడని కమ్మరి, కుమ్మరి మొదలయిన చేతిపని వారల సంగతి వేరే చెప్పాలా ? అలాటి ఒక నిరుపేద కమ్మరి కుటుంబం లోనే పుట్టాడు కామ్రేడ్ టిటో.

పేదరికం ఉంటే ఇక ఇబ్బందులకు ఏం తక్కువ ? వాటి అన్నిటికితోడు ముసలితనంతో వంగు బండిపోయిన తాత అమ్మమ్మల్ని పోషించే భారంకూడా ఒకటి మీద బడింది. టిటో తండ్రిపేరు ఫ్రాజ్. తన ఒక్క రెక్కల కష్టంతోనే ఫ్రాజ్ ఈ సంసారాన్ని అంతా ఈదవలసి వచ్చింది. ఇలాంటి పరిస్థితుల్లో బిడ్డల శిక్షణ, ఆరోగ్యరక్షణను గురించి శ్రద్ధతీసుకోవడం అసంభవం అని వేరే చెప్పనక్కర్లేదు. అలాంటి వాతావరణంలో జన్మతః ఎముకపుష్టివున్న బిడ్డలు తమంతట తాము గాలికి పెరగాలిసిందే కాని గడియ గడియకు మందులు మాకులు ఇచ్చి చేతులమీద బ్రతికించడం అనేది కలలోని మాట. అది అగర్భ శ్రీమంతుల మాటగాని గర్భదరిద్రులకు అందుబాటులోవున్న విషయంగాదు. పూటకిన్ని గంజినీళ్లు కూడా దొరికీ దొరకని కటికిపేద కుటుంబంలో కామ్రేడ్ టిటో పుట్టి పెరిగాడంటే పైతృకంగా సంక్రమించిన పౌష్టవమే అందుకు కారణం. వకవకలాడే పేగులతో చినిగి మాసిపోయిన చింపిరి గుడ్డలతో, చిన్నతనంలో టిటో గాలిగా తిరుగుతూ ఉండేవాడు.

పోకిరిగా తిరిగి చివరికి వట్టి అల్లరిపిల్లకాయలాగా తయారుఅవుతాడేమో అని తండ్రి తన కొడుకును ఆ ఊళ్ళోనే ఉన్న ఒక జీతబత్తాలు

లేని బళ్లో చదవేశాడు. కాని టిటోకి ప్రొద్దస్తమానం ఆ బళ్లో పంతుల కెదురుగా కూర్చోవడమంటే తలప్రాణం తోకకు వచ్చేది. ఒక్క పదియ కూడా కాలు నిల్చేది కాదు. ఈ లక్షణాలన్నీ చూచి ఇక లాభంలేదని పెదవి విరిచాడు పంతులు.

అయినా తండ్రి ఏదో ఒక విధంగా పంతుల్ని బ్రతిమాలుకుంటూ కొడుకుని నాలుగు సంవత్సరాలపాటు చదివించాడు. ఇవ్వవలసిన హైముకు హోమ్ వర్క్ ఎప్పుడూ పూర్తిజేసి ఇచ్చేవాడుకాదు. గోడకుర్చీ వేయడం అతని కొకమామూలు అయిపోయింది. ఆటల్లో మాత్రం మహా పహిషా రుగా ఉండేవాడు. టిటో పాల్గొన్నపక్షం నమ్మకంగా జయించినట్లే. అందు వల్ల ప్రతి ఆటలో పాల్గొనమని తోటిపిల్లలు అతన్ని ఎంతో బలవంత పెడుతూ ఉండేవాళ్ళు. మోకాళ్ళు మోచేతులు చెక్కులు లోగొట్టుకొని గాయాలతో నెత్తురు గారుకుంటూ పొద్దుపోయిన తర్వాత ఎప్పుడో ఇంటికి చేరుకునేవాడు. ఇప్పటికీ టిటో ఒంటిమీద చిన్నప్పటిగాయాల మచ్చలు స్పష్టంగా కనుపిస్తూ ఉంటాయి. తర్వాత 40 సంవత్సరాలకు స్పెయిన్ అంతర్యుద్ధంలో పాల్గొంటానికి వెళ్ళినప్పుడు ఒక మిత్రుడు టిటోనిజూచి " ఈ మచ్చలేమిటి ? " అని అడిగాడు. " అవి విప్లవ స్వభావానికి చిహ్నాలు " అని చిరునవ్వు నవ్వుతూ జవాబు చెప్పాడు.

అటు స్కూలుకు వెళ్ళకుండా ఇటు ఇంటిపని చేయకుండా రెంటికి చెడ్డరేవడిలాగా పోకిరిగా తిరుగుతున్నాడని కొడుకుని అంతటితో చదువు మాన్పించాడు తండ్రి. పదకొండు సంవత్సరాల వయస్సువున్న కుర్రవాడు కమ్మరి పని చేయడం అంటే తేలికా ? అందులో సూర్యోదయం నుంచి సూర్యాస్తమయంవరకు వంచిన నడుం ఎత్తకుండా పనిచేయాల్సి వచ్చేది. అయినా టిటో కిక్కురు మనకుండా అలాగేచేస్తూ ఉండేవాడు. ఈ కఠిన పరిశ్రమతో ఆరు సంవత్సరాలు గడిచాయి.

బూట్లకు నాడాలు వేయించుకోవడం కోసం, గుర్రాల గిట్టలకు నాడాలు వేయించడం కోసం అనేక రకాల మనుష్యులు కొలిమిదగ్గరకు వస్తూపోతూ ఉండేవారు. బస్తీవాళ్ళ సూటూ బూటు తాకు టీకు చూస్తూవుంటే టిటోకి అదొక విచిత్రంగా ఉండేది. బస్తీలు చాలా

బాగుంటాయి అని కూడా విన్నాడు. ఎప్పుడు బస్తీకి వెళదామా, పెద్ద పెద్ద బంగళాలు ఎప్పుడు చూద్దామా, రైళ్లూ కార్లు ఎప్పుడు ఎక్కి తిరుగుదామా, అని ఉవ్విళ్ళూరుతూ ఉండేవాడు. పల్లెటూళ్ళో ఒక వారంరోజులు పని చేసేదానికంటే బస్తీలో ఒక రోజు పనిచేసినా ఎక్కువ జీతం వస్తుంది అని విన్నాడు. బస్తీజీవితం ఏంతో హాయిగా ఉంటుందని కలలు గంటూ ఉండేవాడు. కాని బస్తీకి వెళ్ళడం ఎలా ?

ఒకరోజు ఒకబాటసారి ఎవరో దారినపోతూ ఒక అణా డబ్బులు టిటోకి ధర్మం ఇచ్చి వెళ్ళిపోయాడు. టిటో ఆనందానికి హద్దూపద్దులేదు. ఎగిరి గంతులు వేశాడు. ఈ అణాని ఏం జెయ్యాలి ? తండ్రికిద్దామా ? అనుకున్నాడు. కాని మనస్సు ఒప్పలేదు డబ్బుయొక్క ప్రాముఖ్యత బాగా తెలుసు. "డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు" అనేది అతనికి స్వానుభవైక వేద్యమే. ఒకసారి పొరుగింటివారికి ఏదో కొంతడబ్బు ఇవ్వవలసి వుంది. ఆ డబ్బును జాగ్రత్తగా ఇచ్చిరమ్మని బ్రాజ్ (తండ్రి) టిటోకిచ్చాడు. "ఇందులో ఒక దమ్మిడీ అయినా దారిలో పారేశావా, ఈ సమ్మెటతో నీ తలకాయ చితక బొడుస్తాను" అని తండ్రి ముందే వార్నింగ్ ఇచ్చాడు. కాబట్టి ఈ అణాడబ్బుల్ని అతిజాగ్రత్తగా అట్టి పెట్టాలి సుమా అనుకున్నాడు. తండ్రికి తెలిస్తే ఊరుకోడు. నీ కీ డబ్బు ఎక్కడనుంచి వచ్చిందని అడుగుతాడు ? పల్లెటూరి పిల్లకాయల జేబుల్లో స్వంతడబ్బులు ఎందుకుంటాయి ? ఈ పేచీ అంతా ఏందుకు అనుకున్నాడు. దొడ్లోవున్న సీమరేగు చెట్టుకింద ఒక గొయ్యి దీసి అందులో పూడ్చి పెట్టాడు.

టిటో జీవితంలో డబ్బుకూడబెట్టడం అదే మొదటిసారి. ఆశ ఇంకా ఎక్కువ అయింది. ఆ డబ్బులతోపాటు ఇంకాకొన్ని డబ్బులు కూడా సంపాదించి అక్కడే భూస్థాపితం చేస్తూ ఉండేవాడు. ఇలా కొంత డబ్బు సమకూర్చుకున్న తర్వాత బస్తీకి ప్రయాణం కట్టాలని టిటోప్లాను. బస్తీజీవితం అంటే అతని దృష్టిలో అదొక నూతన ప్రపంచం, రైళ్ళూ కార్లు సినీమాలు నాటకాలు ఆకాశాన్ని ముద్దుబెట్టుకొనే ఆ పొగగొట్టాలు నాలుగు మూడు అంతస్థుల మేడలు, తళతళలాడే ఎలెక్ట్రిక్ దీపాలు, దిద్దిర్చిన బొమ్మల్లాగా చక్కగా అలంకరించుకొని షికార్లుచేస్తూవుండే ఆ

యువతీ యువకులు, అమృతంలాగా ఉండే ఆ ద్రాక్షాసవం, ఆ దేవేంద్ర భోగం అదంతా తలుచుకుంటే సాక్షాత్ భూలోకస్వర్గమే అనుకున్నాడు. పంజరంలో బంధించబడిన పక్షిలాగా పొద్దస్తమానం కొలిమికి ఎదురుగా కూర్చోవడం అంటే అతని ప్రాణం విసిగెత్తిపోయింది. ఈ బందిఖానా నుంచి ఎప్పుడు బైటపడదామా అని అదునుకోసం వేచి కూర్చున్నాడు

తండ్రికంటె ముందేవచ్చి రోజూ కొలిమి దగ్గిర ఊడ్చి నీళ్ళుచల్లి బాగుచేస్తూ ఉండేవాడు. ఎప్పటిలాగే ఒకరోజు తండ్రికంటె ముందేలేచి కొలిమిదగ్గరకు వచ్చాడు. పాతిబెట్టిన డబ్బు తవ్వి బైటికితీశాడు. తండ్రి వస్తూవున్నాడేమో అని అటూ ఇటూ పారజూశాడు. చినిగిపోయిన ఒక పాతకోటుమ తగిలించుకున్నాడు. బ్రతుకు జీవుడా అని బస్తీదారి బట్టాడు.

ఊరుదాటి బైటికి వచ్చాడు. ఒక్కసారి వెనక్కితిరిగి ఊరంతా కలయ జూశాడు. చిన్నప్పటినుంచి పుట్టిపెరిగినగడ్డను వదిలిపెట్టి పోతున్నా గదా అని విచారించాడు. కండ్లు చెమ్మగిల్లాయి. ముసలి తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఈ పాటికి తండ్రి కొలిమిదగ్గిరకి వచ్చిఉంటాడు. తాను కనబడక పోవడంవల్ల తన పేరుబెట్టి బిగ్గరగా పిలుస్తూవుంటాడు. నేను ఎక్కడికి వెళ్ళానో అని వీధులవెంటబడి తిరుగుతూ ఉంటాడు. బస్తీ చూడాలనే సరదా టిటో మనస్సును ముందుకు లాగుతూఉంది. కాని ప్రేమబంధాన్ని తెంచుకోలేక పోతున్నాడు. ఏమి చెయ్యాల్నో తోచలేదు. అడుగులు ముందుకు బడడంలేదు. అతని పరిస్థితి కుడితిలోబడ్డ ఎలుకలాగా అయింది. మళ్ళీ ఆ కొలిమి, ఆ సమ్మెట, జ్ఞాపకం వచ్చాయి. ఇక ఆ బందిఖానాలో పడి ఉండడం అసంభవం అనుకున్నాడు. ఇంతలో తన్ను వెదుక్కుంటూ తండ్రివస్తే....ఎన్నాళ్ళనుంచో వేసుకున్నప్లాను ఎగిరిపోతుంది. 'సాహసే లక్ష్మీ' అనుకున్నాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. ఒకవేళ తండ్రికి తాత్కాలికంగా ఇపుడు కొంచెం కష్టంగావుంటే మాత్రం ఏం? తాను బస్తీకెళ్ళి శ్రీమంతుడై తిరిగివచ్చిన తర్వాత తండ్రి కెంతసంతోషం కలుగుతుంది?.. దర్జాగా ఒక చిన్న కారును వేయించుకొని వస్తాను. ఊళ్ళో వాళ్ళంతా విచిత్రంగా నన్ను చూడ్డానికి గుంపులు గుంపులుగా మా కొలిమిదగ్గరకి వచ్చి చేరుతారు. వాళ్ళందర్నీ కూర్చోబెట్టి ఎన్నో బస్తీకబుర్లు చెప్పుతాను.

వాళ్ళందరు పొంగిపోతారు. ఎంత గొప్ప పనిచేశావురా అబ్బాయీ అని చుట్టాలంతావచ్చి నన్ను కౌగలించుకుంటారు. ముసలితనంలో కష్టపడ కుండా తండ్రిని హాయిగా కూర్చోబెట్టి కమ్మని రొట్టెముక్కలు తినిపిస్తాను. ద్రాక్షాసవం తాగిస్తాను.... అని ఏవేవో గాలిమేడలు కట్టుకుంటూ వంచిన తల ఎత్తకుండా గబగబా నడిచాడు. ఎలాగయితేం చివరికి ఎన్నాళ్ళ నుంచో తాను కలలుగంటూ ఉన్న ఆ నూతన ప్రపంచంలో అడుగు బెట్టాడు జన్మ తరించింది అనుకున్నాడు.

---

# బస్తీకి పలాయనం

అంతా విచిత్రంగా ఉంది. ఏమిటి ఈ బండ్లు ఇంతవేగంగా పరు గెత్తుతూ ఉన్నాయి! ఇంత పొడుగున్నాయేమిటి? గుర్రాలు లేకుండా వాటి అంతట అవే అటు ఇటూ పరుగెత్తుతూ వుండే బండ్లను జూస్తే టిటోకి ఆశ్చర్యం వేసింది. ఉత్తుంగ తరంగాలతో పొంగిపొరలతూ ఉన్న నల్లసముద్రం ఎంత అద్భుతంగా వుంది? ఇన్ని నీళ్ళు ఎక్కడనుంచి వచ్చాయి? ఇంత మహాప్రవాహాన్నికూడా పాయలుగా చీల్చుకుంటూ వస్తూ ఉన్న ఓడలు ఎంత తమాషాగా ఉన్నాయి? ఒక్కొక్క ఓడ ఎంత పెద్దది? క్లాన్యెట్స్ గ్రామంలో ఉన్న జనం అంతా ఒక్కఓడలో ఉన్నంత లేరే? టిటోకు ఇదంతా ఒక స్వప్నజగత్తులాగా ఉంది.

జేబులో ఉన్న నాలుగురాళ్ళు మెల్లమెల్లగా అయిపోతూ ఉన్నాయి. అన్నిటికంటె ఇదే పెద్దచిక్కు. పల్లెటూళ్లో ఉంటే కాని డబ్బుకూడా ఖర్చు అయ్యేది కాదు, కాని ఇక్కడో? ముందుడబ్బు మోగిస్తేనే........

క్లాన్యెట్స్‌లో వేళకింత కలోగంజో దొరికేది. కాని ఇక్కడమందు డబ్బు చెల్లించుకుంటేనే తిండి. లేకపోతే పస్తు పండుకోవాలిసిందే.

ఎక్కడో ఒకమూల ఒక సత్రవలో ఒక చిన్నగది అద్దెకు తీసు కున్నాడు. కాఫీ భోజనంకూడా ఆ సత్రవలోనే తీసుకోవాలి. కాఫీ వట్టి చూరు నీళ్ళకంటెకూడా అన్యాయం. తిండిసంగతి వేరే చెప్పనక్కర లేదు. గుర్రం గుడ్డిది అయినా దానా దప్పదు అన్నట్లు రేటుమాత్రం పూర్తిగా చెల్లించుకోవలసిందే. ఒకరోజు సాయంత్రం భోంచేసి డబ్బు ఇవ్వడానికి సంచితీశాడు. కావి సంచిఖాళీ. యజమాని వెంటనే టిటోను సత్రవలోనుంచి సెలవు పుచ్చుకోమన్నాడు.

భావిజీవిత కార్యక్రమం ఏమిటో టిటోకి బోధపడలేదు. మనస్సు చీకాకుగా ఉంది. కొంచెంసేపు రైల్వేస్టేషన్‌కైనా వెళ్ళుదాం అను కున్నాడు. 'హిస్సు బుస్సు' మంటూ వచ్చేపొయ్యే రైలుబండ్లు, ఎక్కే వాళ్ళు దిగేవాళ్ళు. ఆ దృశ్యం చూస్తూఉంటే కొంత అయినా మనశ్శాంతి కలుగుతుందిగదా అని బయలు దేరాడు.

ఇంతలో వెనుకనుండి ఎవరో పిల్చారు.

"ఎవరు అబ్బాయీ నీవు? ఏం చేస్తున్నావు ఇక్కడ?".

"స్టేషనుకు వెళ్ళుతున్నాను"

"ఎందుకు"

"ఒక స్నేహితుణ్ని కలుసుకోడానికి అని వెంటనే ఏదో ఒక సమాధానం ఇచ్చాడు. కాని అతని జవాబు అతని మనస్సుకే వెగటుగా తోచింది.

అమాయికుడైన కుర్రవానివంక వాళ్ళు జాలిగా చూచారు. అందులో ఒకరు ఇలా అన్నారు.

అదిగో చూడు ఆ రోడ్డుమీద ఒక పెద్దమేడ తయారవుతూఉంది. చలికాలం వచ్చేలోపుగానే బిల్డింగు పూర్తిగావాలని యజమాని తొందర పడుతున్నాడు. చాలినంతమంది పనివాళ్ళు దొరకడంలా, మేం కూడా అందులోనే పనిజేస్తున్నాం. నీవుకూడా మాతోపాటు వచ్చి ఎందుకు పని

చేయగూడదు. కట్టుబడి పూర్తి అయినవెంటనే మజూరీఅంతా పూర్తిగా ఇచ్చేస్తాడు. అందాకా నీకు తిండికేమీ ఇబ్బంది ఉండదు.

అంతకంటె వేరేగత్యంతరం లేకపోయినా పరాయివాళ్ళముందు టిటో ఒక్కసారిగా తన హీనస్థితిని అంగీకరించలేక పొయ్యాడు. నే నిది వరకే ఒకపనిచేస్తూ ఉన్నానని సమాధానం ఇచ్చాడు.

ఎక్కడ ? ఏ పేటలో ? ఏమిపని ? అని మళ్ళీ ఆతను అడిగేటప్ప టికి టిటోపని తెత్తెతె, మెమ్మెమె, అయింది. టిటో బయలు దేరింది ఎక్కడైనా పని దొరుకుతుందేమో అని ఆలోచించడానికేనాయె. చల్లకు వచ్చి ఎంతసేపు ముంతదాచడం ? చివర కంగీకరించాడు.

పని చాలా కష్టమైనదే. కాని చిన్నప్పటినుంచి కష్టాల కలవాటు పడిన టిటోకి అది సామాన్యంగానేఉంది. పగలు పొద్దాక పనిచేసేవాడు. రాత్రివేళ గచ్చునేలమీద పండుగొని నిద్రబోయేవాడు. తిండికూడా ఒక మోస్తరుగాఉంది. సత్రవతిండిలాగా మరీ అంత అధ్వాన్నంగాలేదు.

అనుకున్న గడువుకి పని పూర్తి అయింది. పనివాళ్ళంతా తమకు రావాలసిన మజూరీకోసం ఎదురుజూస్తూ కొత్తగా తాముగట్టిన ఇంటిఆవర ణలో కూర్చున్నారు. ఇంతలో యజమాని ఒక రూపాయలసంచి తీసికొని వచ్చి మేస్త్రీకిచ్చి వెళ్ళిపొయ్యాడు. వెనుకటినుంచి వస్తూఉన్న ఆచారం ప్రకారం ఆ డబ్బును పనివాళ్ళు తమలో తాము పంచుకున్నారు. ఎక్కువ అనుభవం ఉన్నవాళ్ళకి ఎక్కువ మజూరీ, తక్కువ అనుభవం ఉన్నవాళ్ళకి తక్కువ. టిటోలాంటి కొత్తగావచ్చిన వారికి ఇంకా తక్కువ.

అందరికంటె తక్కువే వచ్చినప్పటికి టిటోకి అదే ఒక పెద్ద ఆశ్చర్యం అయింది. సీమరేగు చెట్టుకింద ఉన్నగోతిని త్రవ్వినప్పుడెంత సంతోషం కలిగిందో ఇప్పుడూ మళ్ళీ అంత సంతోషం కలిగింది.

చలికాలం జాగ్రెబ్‌లో ఉండటం చాలా కష్టమైన పని. అందులో ముఖ్యంగా బీదవాళ్ళకి. టిటోతోకలసి పనిజేసిన మిత్రులందరూ తమతమ ఇండ్లకు వెళ్ళిపోతూ టిటోనుకూడా రమ్మన్నారు. కాని వచ్చిన ఈ నాలుగు డబ్బులతోనే సంతృప్తిపడి ఇంటికి వెళ్ళిపోవడం అంటే టిటోకి ఏమీ

నచ్చలేదు. ఏ మైనాసరే అక్కడే తిష్టవేద్దాం అనుకున్నాడు. తలపెట్టిన పనిని పూర్తిగా సాధించకుండా రిక్తహస్తాలతో తిరిగి వెళ్ళిపోవడమేనా ?

రైల్వేస్టేషనుకి సంబంధించిన ఒక కార్ఖానాలో పనిచేయడానికి వెళ్ళాడు. ఇంతకుపూర్వం ఆరు సంవత్సరాలనుండి కమ్మరిపనిచేశాను అని చెప్పడంవల్ల టిటోకి పని తేలికగానే దొరికింది. కాని మైనారిటీ సమస్య అడ్డువచ్చింది. తన కిదివరకే 18 సంవత్సరాలు వెళ్ళిపొయ్యాయి అని వెనకా ముందాడకుండా అబద్ధమాడేశాడు. అంతటితో ఆ అభ్యంతరంకాస్తా తొలగిపోయింది.

వారానికి ఒకసారి మజూరీ ఇచ్చేవాళ్ళు. ఎవరికి కావలసిన తిండి తిప్పలు వారే చూసుకోవాలి. ఒక చిన్నగది అద్దెకు తీసుకున్నాడు. కాళ్లు ముడుచుకొని పండుకోవాలిసిందేకాని కాళ్ళు జాచుకోడానికికూడా ఆ గదిలో చోటులేదు.

ఆ కార్ఖానాలో టిటో దాదాపు మూడుసంవత్సరాలపాటు పనిచేశాడు. ఈ మూడు సంవత్సరాల్లో టిటో రెండుసార్లు డిస్మిస్ అయ్యాడు. సత్రవలో పెట్టేతిండి చాల అసహ్యంగా ఉంది. "డబ్బుకు డబ్బూ పోయి శనికి శనీ పట్టింది." అన్నట్లు ఒకవైపు ఇచ్చుకునే డబ్బు ఇచ్చుకుంటూనే ఈ అధ్వాన్నపుతిండి ఎందుకు తినాలి ? మన వర్కర్సులోనుంచే ఒక ఆహారకమిటీని ఎందుకు ఎన్నుకోకూడదు ? అని తోటి పనివాళ్ళల్లో తీవ్రంగా ప్రచారం చేశాడు. యజమానుల కీ సంగతి తెలిసింది. వెంటనే టిటోని డిస్మిస్‌చేశారు. కాని వర్కర్సు అందరు ఐక్యంగాఉండి డిమాండ్ చేయడంవల్ల మళ్ళీ టిటోని పనిలోకి తీసుకోక తప్పలేదు.

1912 లో టర్కీమీద బల్గేరియా, గ్రీస్, సెర్బియాదేశాలు యుద్ధం ప్రకటించాయి. ఆ నాటికి ఇంకా కొంతబలంగా ఉన్న టర్కీ సామ్రాజ్యం ముందు ఈ పిల్ల దేశాలు మొదటి దెబ్బకే చిత్తు అవుతాయి అని ప్రపంచం అంతా భావించింది. కాని అందరి ఊహలు తలక్రిందు లయ్యాయి. బల్గేరియా సైన్యాలు దేశాన్ని అంతా జయించుకుంటూ కాన్‌స్టాంటి నోపుల్ గుమ్మం ముందుకే వచ్చాయి. మేసిడోనియాను ఆక్రమించుకున్నాయి.

వయస్సులో చిన్నవి అయినా బాల్కాన్ దేశాలు ఇంతటి అఖండ విజ యాన్ని సాధించినందుకు ప్రపంచమంతా హర్షించింది.

జాగ్రెబ్ విద్యార్థులు బాల్కాన్ దేశాల్ని బలపరుస్తూ బ్రహ్మాండ మైన ఆందోళన జేశారు. కార్ఖానాలో పనిజేస్తూఉన్న వర్కార్లనికూడా యుద్ధానికి సహాయం చేయవలసింది అని విజ్ఞప్తి చేశారు. తమ శక్తి కొలది సహాయం చేయడానికి వర్కార్సుకూడా ముందుకు వచ్చారు. వెంటనే ఒక కమిటీని కూడా ఎన్నుకున్నారు. ఆ కమిటీలో టిటోకూడా ఒక ప్రముఖసభ్యుడైనందువల్ల యజమానులతన్ని డిస్మిస్ చేశారు. కాని వర్కార్సు అందరూ ఐక్యంగాఉండి మళ్ళీ తీవ్రమైన ప్రచారం సాగించడం వల్ల చివరకు యజమానులు లొంగిరాక తప్పిందికాదు. తర్వాత రెండు సంవత్సరాల్లో చెప్పుకోదగ్గ మరేవిశేషం లేకుండా కాలం గడచిపోయింది.

---

# మొదటి ప్రపంచయుద్ధం

1914లో ప్రథమ ప్రపంచ మహాయుద్ధం ఆరంభమయింది. జాగ్రెబ్ మీద అధికారం చలాయిస్తూఉన్న ఆస్ట్రియన్ ప్రభుత్వంకూడా యుద్ధంలోకి దిగింది. తరతరాల నుంచి ఆస్ట్రియన్ సామ్రాజ్యం యొక్క ఇనుప సంకె ళ్ళలోబడి నలిగిపోతూఉన్న స్లావ్ ప్రజలు ఎప్పుడు ఈ పీడ వదిలిపో తుందిరా బాబో అని లోలోపల శాపనార్థాలు పెడుతూ ఉన్నారు. ఈ విషయాన్ని ఆస్ట్రియన్ ప్రభుత్వంకూడా గ్రహించకపోలేదు. అందువల్లనే కార్ఖానాలో పనిజేసే వర్కార్లని అసలు యుద్ధరంగానికి పంపించదలచుకో లేదు. కాని పరిస్థితులు క్రమ క్రమంగా వాళ్ళ చేతుల్లోనుంచి జారిపోతు

న్నాయి. కార్పేథియన్స్ పైపుగుండా రష్యన్ ప్రభుత్వం కూడా ఒక బ్రహ్మాండమైన దండయాత్ర లేవదీసింది. ఈ దెబ్బతో ఇదివరకే ఇటాలియన్ రంగంలో పోరాడుతూఉన్న ఆస్ట్రియన్ ప్రభుత్వంపని ఉక్కిరిబిక్కిరిఅయింది. వేరే గత్యంతరంలేక హడావిడిగా కార్ఫానా పర్వతాల్నిపైగూడా-టిటోతో సహా యుద్ధరంగానికి పంపించింది. ఆస్ట్రియన్ దుస్తుల్లోఉన్న ఈ స్లావ్ సైన్యం అవకాశం దొరికితే చాలు అమ ఆస్ట్రియన్ ప్రభుత్వాన్నే దెబ్బ గొట్టాలని ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తూఉంది. ఆస్ట్రియన్ ప్రభుత్వం స్లావ్స్‌ను మొదటినుంచి స్లేవ్స్ ( బానిసలు ) గానే చూస్తూ ఉండేది. అందువల్ల స్లావ్స్ సైన్యం గ్రూపులు గ్రూపులుగా డివిజన్లకు డివిజన్లే బుద్ధి పూర్వకంగా రష్యన్ సైన్యానికి లొంగిపోయింది.

దీనికి కారణం ఆస్ట్రియన్ ప్రభుత్వంమీద రగుల్కొంటూ ఉన్న ద్వేషమే. అంతేకాని జారిస్టు రష్యా మీదఉన్న ప్రేమకాదు. రష్యన్ ప్రభుత్వంకూడా ఎప్పుడో తుప్పు పట్టిపోయిన సామ్రాజ్యవాద నిరంకుశ ప్రభుత్వమే అని టిటో బహిరంగంగా ప్రచారంచేస్తూ ఉండేవాడు. ఈ సంగతి అధికారులకు తెలిసింది. వెంటనే టిటోని అరెస్టుజేసి జైల్లో బంధించారు.

## రెడ్ ఆర్మీ సోల్జర్ ( ఎర్ర సైనికుడు )

ప్రపంచయుద్ధం సమాప్తి అయింది. ఈ యుద్ధఫలితంగా మొత్తం ప్రపంచంలో ఆరోవంతు భూభాగంలో ప్రథమంగా సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడింది, రైతు కూలీరాజ్యం స్థాపించబడింది. పట్టపగలే ప్రజల కష్టార్జితాన్ని దోచుకొని మజాకోసం మానవ హింసచేసే ఒక పెద్ద బందిపోటు దొంగ అయిన జారు ప్రభువుని తలకాయనరికి అవతల పారేశారు. రైతు కూలీలే రాజ్యాధికారాన్ని వశపరుచు కున్నారు. తమ కష్టజీవుల రాజ్యాన్ని కాపాడే స్వంతసైన్యాన్ని - రెడ్ ఆర్మీని - నిర్మించుకున్నారు.

ఎర్ర సైన్యం వెంటనే జైళ్ళతాళాల్ని బద్దలు గొట్టింది. బందిఖానాల్లో బంధించబడిన ఖైదీలందర్నీ ఇష్టమైతే స్వేచ్ఛగావచ్చి తమ రెడ్ఆర్మీలోచేరమని హృదయపూర్వకంగా ఆహ్వానించింది. ఇదంతాచూచి టిటో ముగ్ధుడైపొయ్యాడు. తమ ఊరుపేరు అడగలేదు. కులమతాల్ని ప్రశ్నించలేదు. ఏ

దేశస్థుడైన ఏ వస్తుడైనాసరే కష్టజీవులందరూ ఒకటే అనేసత్యాన్ని టీటో ఈ సందర్భంలోనే మొట్ట మొదటిసారి గుర్తించాడు. ఖైదీలందరు మహా సంతోషంగా రెడ్ ఆర్మీలో సైనికులుగా చేరారు. చిన్నప్పటినుంచి టీటో రెక్కలు ముక్కలు చేసుకొని చెమటోడ్చి కష్టపడి పనిచేసే కమ్మరిబిడ్డ. కాబట్టి కష్టజీవుల ప్రభుత్వాన్ని స్థిరంగా నెలకొల్ప దానికి తన సర్వశక్తులు ధారపోశాడు. అహోరాత్రులు కష్టపడ్డాడు. వీరోచితంగా రెడ్ ఆర్మీకి ముందుండి పోరాడాడు. బానిసత్వంలో బడి ప్రమగ్గిపోతూఉన్న ప్రపంచ కష్టజీవు లందరికి సోవియట్ రష్యాయే ఆశాజ్యోతి అని గ్రహించాడు. అనేక యుద్ధ రంగాల్లో - సైబేరియాలో, ఫిన్లండ్‌లో, బాల్టిక్ దేశాల్లో, కాకేసస్‌లో, క్రైమియాలో - హోరాహోరిగా రెండు సంవత్సరాలు పోరాడాడు. ఎన్ని ఇబ్బందులు వచ్చినా ఎదుర్కొన్నాడు. నిరుత్సాహంతో అప్పుడప్పుడు కండ్లు తేలవేసే సోదరసైనికుల్లో నూతనోత్సాహాన్ని పురి కొల్పాడు. రష్యా అంతర్యుద్ధంలో ఒక ప్రముఖపాత్ర వహించాడు. ఈ యుద్ధంద్వారా ఎంతో గొప్ప అనుభవాన్ని సంపాదించాడు. నివురుగప్పిన నిప్పులాగాఉన్న రైతు కార్మికవర్గంలో అంతర్భూతంగా ఎంత విప్లవాగ్ని రగుల్కొంటూఉందో కండ్లారా చూశాడు. అతని హృదయంలో ఒక అచంచలమైన ఆత్మవిశ్వాసం కలిగింది. యుగోస్లేవియాలో మాత్రం ఈలాటి విప్లవం ఎందుకు తీసుకరాగూడదు అనుకున్నాడు. తన మాతృ భూమిలో కూడా రైతు కూలీ రాజ్యాన్ని స్థాపించడమే తన జీవిత పర మావధి అని నిశ్చయించుకున్నాడు.

# పార్టీ నిర్మాణం

రష్యాలో అంతర్యుద్ధం ముగిసింది. ఈ అంతర్యుద్ధంలో అనేక దక్కా మొక్కీలు తిని టిటో చక్కటి అనుభవాన్ని గడించి మాతృ భూమికి తిరిగి వచ్చాడు. రష్యాలో ఉన్న సమయంలోనే ఒక రష్యన్ స్త్రీని పెండ్లి చేసుకున్నాడు. ఒక కొడుకుకూడా జన్మించాడు. అతని పేరు జర్కో. మొన్న జరిగిన ద్వితీయ ప్రపంచమహాయుద్ధంలో వీరోచితంగా పోరాడి తండ్రికి మించినకొడుకు అనిపించుకున్నాడు. యుద్ధంజేస్తూ ఉన్న సమయంలో కామ్రేడ్ జర్కో ఒక చెయ్యి విరిగిపోయింది. జర్కో ప్రదర్శించిన అకుంఠిత ధైర్యసాహసాల్ని సోవియట్ ప్రభుత్వం యెంతో ప్రశంసించింది. "హీరో ఆఫ్ ది సోవియట్ యూనియన్" అనే బిరుదునుకూడా బహూకరించి ఎంతో సన్మానించింది.

భార్యాపుత్రుల్నికూడా టిటో తనతోపాటు యుగోస్లేవియాకు తీసుకు రావాలని అనుకున్నాడు. కాని యుగోస్లేవియా ఆంతరంగిక పరిస్థితులు ఆందోళన కరంగా ఉండడంవల్ల ఆ కోర్కె నెరవేరలేదు. భార్యాపుత్రులు మాస్కోలోనే ఉండిపోయ్యారు. టిటో ఒక్కడే స్వదేశానికి తిరిగి వచ్చాడు. యుగోస్లేవియాలో టిటో తన రాజకీయ జీవితాన్ని ప్రారంభించబోయేముందు అక్కడి పరిస్థితులు ఏలా ఉన్నాయో ఒకసారి పరిశీలించుదాం.

రాజ్యాధికారం అంతా సెర్బియన్ రాజులచేతుల్లోఉంది. సెర్బియన్లు తమ తెగకు చెందని ఇతర జాతుల్ని బానిసలకంటె హీనంగా పరిగణిస్తూ ఉన్నారు. కులమత ద్వేషాలు రెచ్చగొట్టి తమ నిరంకుశాధికారాన్ని సురక్షితంగా ఉంచుకోవాలని కుట్రపన్నుతూ ఉన్నారు. ప్రజా ప్రభుత్వం కావాలని దేశమంతటా తీవ్రమైన ఆందోళన బయలుదేరింది. తత్ఫలితంగా 1920 నవంబరు 28 వ తేదీన ఎన్నికలు జరిగాయి. మొట్టమొదటిసారి జరిగిన ఎన్నికల్లోనే ప్రభుత్వపక్షం చిత్తుఅయింది. ఎన్నికల ఫలితాల్ని ఒకసారి పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది.



మార్షల్ టిటో

యుగస్లావు గెరిల్లా ఉద్యమ పార్లమెంటులో మాట్లాడు చుండుట.

| | |
|---|---|
| ప్రభుత్వ పక్షం | 285000 |
| డెమాక్రటిక్ పార్టీ | 320000 |
| క్రోట్ కర్షకపార్టీ | 230000 |
| కమ్యూనిస్టుపార్టీ | 190000 |
| రైతు పార్టీ | 152000 |
| స్లోవిన్ క్లెరికల్ పార్టీ<br>బోస్నియన్ ముస్లింపార్టీ | 100000 |
| సోషలిస్టుపార్టీ | 53000 |

ప్రభుత్వ వ్యతిరేక పక్షాలకి వచ్చిన వోట్లనుచూచి ప్రభుత్వం హడలిపోయింది. ప్రజాస్వామిక పద్ధతులతో ఇక తన హక్కులను కాపాడుకోవడం అసంభవం అని తేలిపోయింది. బహిరంగంగా దుర్మార్గానికి ఒడిగట్టింది. 59 మంది కమ్యూనిస్టు ప్రతినిధుల్ని పార్లమెంటు నుంచి బహిష్కరించింది. రాజభక్తిపరులు కారనే సాకుచెప్పి క్రోట్ కర్షక పార్టీ ప్రతినిధుల్ని వెళ్ళగొట్టింది. ఎన్ని ఘోరాలుచేసినప్పటికి రెండోసారి జరిగిన ఎన్నికల్లో మొత్తము 294 మంది ప్రతినిధుల్లో 151 మంది ప్రభుత్వ వ్యతిరేక పక్షాలకి చెందినవారే తిరిగి ఎన్నుకోబడ్డారు. దీనితో ప్రభుత్వానికి మరీ కంగా రెత్తింది. రైతు నాయకుడయిన రేడిచ్‌ని అసెంబ్లీహాల్లోనే ఒక ప్రభుత్వ ప్రతినిధి రివాల్వరుతో ఘోరంగా కాల్చి వేశాడు. ప్రజలలో ప్రభుత్వమంటే నానాటికి అసంతృప్తి పెచ్చుపెరిగి పోతూఉంది. నామమాత్రమైన బూర్జువా ప్రజాస్వామికంచాటునకూడా ఇక తమ దొంగనాటకం సాగదని ప్రభుత్వం గ్రహించింది. 1929 జనవరి 6 వ తేదీన పార్లమెంటునే రద్దుజేసి సర్వాధికారాలు అలెగ్జాండరు రాజే వశపర్చుకున్నాడు. నూటికి మూరుపాళ్ల ఫాసిస్టుప్రభుత్వాన్ని నెలకొల్పాడు.

ఫాసిస్టు ప్రమాదాన్ని ఎదుర్కోడానికి కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్ని ఇతోధికంగా బలపర్చడమే సరియైన మార్గమని టిటో గ్రహించాడు. రైతు కూలీలు వగయిరా కష్టజీవులందరు తమతమ వర్గసంఘాల్లో సంఘటితమై తమ హక్కులకోసం తీవ్రంగా పోరాడాలి, ఈ ప్రజా సంఘాలన్నిటిని

ఒక సక్రమ పద్ధతిలో నడిపించడానికి క్రమశిక్షణకలిగి నిర్మాణయుతంగా పనిచేసే కమ్యూనిస్టుపార్టీ ఎంతో అవసరం. ఇంతకు పూర్వం రష్యాలో తాను గడించిన అనుభవం యుగోస్లేవియన్ కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో టిటోకి ఎంతో ఉపయోగపడింది. జారు ప్రభుత్వంలో రష్యా ప్రజలు ఏ విధంగా బాధపడ్డారో అలెగ్జాండర్ ప్రభుత్వంలో యుగోస్లేవియా ప్రజలు కూడా అదేవిధంగా అనేకబాధలు పడుతూఉన్నారు. ప్రభుత్వయంత్రం అంతా అక్రమాల, అన్యాయాలమీద ఆధారపడి నడుస్తూంది. ఉద్యోగస్తుల్లో లంచగొండితనం మితిమీరి పోతూంది. ప్రజాసామాన్య జీవితం నానాటికి దుర్భరం అవుతూవుంది. రైతు, కార్మికవర్గాలలో ఎన్నాళ్ళనుంచో అణగి మణగిఉన్న విప్లవాగ్ని నేడు తన శత్రువుల్ని నాశనము చేయడానికి నాలు కలు సాచుతూవుంది. మొట్టమొదటిసారి జరిగిన ఎన్నికలలోనే కమ్యూ నిస్టుపార్టీ మొత్తం దేశంలో మూడోపార్టీగా ముందుకు వచ్చిందంటే రైతు కార్మిక వర్గము విప్లవపోరాటానికి సిద్ధంగా ఉంది అని స్పష్ట మవుతూవుంది.

మితవాదులలోను, మధ్యతరగతి ప్రజలలోకూడా ప్రభుత్వం అంటే తీవ్రమైన అసంతృప్తివుంది. కాబట్టి కమ్యూనిస్టుపార్టీ ఇతర రాజకీయ పార్టీలతోకూడా కలిసి పనిచేయాలిసిన అవసరం ఎంతో ఉందని టిటో గ్రహించాడు. ప్రజాస్వామికాన్ని బలపరచే వివిధ జాతీయ శక్తులలో ఐక్యత తీసుక రావడానికై ప్రయత్నించాడు. అన్నిజాతులకు స్వయం నిర్ణయహక్కు ఉండాలని విరివిగా ప్రచారంచేశాడు. టిటో నాయకత్వం కింద కమ్యూనిస్టుపార్టీ మూడు పువ్వులూ ఆరుకాయలుగా దినదినాభివృద్ధి పంది యుగోస్లేవియా రాజకీయాల్లో ఒక ప్రధానశక్తిగా తయారైంది.

## అరెస్టు

కమ్యూనిస్టుపార్టీ బలపడుతూఉంటే నిరంకుశాధికారవర్గం చూస్తూ చేతులు ముడుచుకొని కూర్చుంటుందా ? కమ్యూనిస్టుపార్టీని నిషేధిస్తూ శాసనాలమీద శాసనాలు చేసింది. కమ్యూనిస్టుపార్టీ సభ్యునికి 10 సంవత్స రాలనుంచి 15 సంవత్సరాలవరకు జైలుశిక్ష, అర్గనైజరుకి మరణశిక్ష అని

ప్రకటించింది. మరణశిక్షకూడా గొంతుక తాడుబోసి ఒక్కసారేలాగడం కాదు. చిత్రవధ, ఘోరాతి ఘోరమైన చిత్రవధ.

1923 నుంచి టిటో రహస్యంగా ఉండి కమ్యూనిస్టుపార్టీ నిర్మాణానికి పూనుకున్నాడు. ఒక ఇల్లు ఒక ఊరు అంటూలేదు. దేశమంతా తిరుగుతూ ఉండేవాడు. టిటోని పట్టుకోడానికి ప్రభుత్వం భగీరథ ప్రయత్నం చేసింది. కార్మికులకు పోలీసులకుమధ్య అనేక దెబ్బలాటలు జరుగుతూ ఉండేయి. టిటోని పట్టుకోడానికి పోలీసులు ఊరూరూ తిరిగారు. దేశమంతా గాలించారు. ఎలాగయితేం చివరకు చచ్చీచెడి సాధించారు.

బెల్గ్రేడ్ కేఫ్‌లో వర్కర్లందరు రహస్యంగా సమావేశమై పార్టీ విషయాలుచర్చిస్తూ ఉండేవాళ్ళు. ఇదిచాలా సురక్షితమైన స్థలం. ఇందులో రెండు గదులున్నాయి. రెండువైపుల రెండు ద్వారాలుఉన్నాయి. పోలీసులు వస్తూఉన్నట్లు ఆచూకీతెలిస్తే వెంటనే వర్కర్లందరు దొడ్డి గుమ్మంగుండా దగ్గరలోఉన్న రైల్వేక్వార్టర్సువైపు పరుగెత్తేవాళ్ళు. ఆ ప్రాంతంలోవున్న ప్రతి స్త్రీ ప్రతి పురుషుడు పార్టీ సానుభూతిపరులే. అందువల్ల పోలీసుల కంటబడకుండా తేలికగా తప్పించుకోగలిగేవాళ్ళు.

కాని ఈసారి (1928) పోలీసులు ప్రత్యేక కట్టుదిట్టాలతో తయారయ్యారు. ఒకగ్రూపు ఇంటిముందు కాపలావుంది. మరోగ్రూపు మర తుపాకులతో సహా దొడ్డిగుమ్మముదగ్గర పొంచికూర్చుంది. మరికొందరు ముందే ఇంటిపైకెక్కి కప్పుమీద కూర్చున్నారు. ఒక పోలీసువాడు ఇంట్లోకి ప్రవేశించాలని గుమ్మంలో అడుగుపెట్టాడు. వెంటనే అతన్ని కాల్చివేశారు. రెండువైపులనుంచి కాల్పులుసాగాయి. అసంఖ్యాకులైన సాయుధ పోలీసులతో ఆ కొద్దిమంది ఎందాకా పోరాడగలుగుతారు. అందర్ని అరెస్టుజేసి జైల్లో బంధించారు. ఒక నెలరోజులు గడచిన తర్వాత కేసు విచారణకు వచ్చింది. పోలీసులు ఎన్ని అవస్థలుపడ్డా టిటోను కమ్యూనిస్టు ఆర్గనైజరు అని రుజువుచేయలేక పోయారు. అందువల్ల టిటోకు 5 సంవత్సరాల జైలుశిక్ష విధించబడింది.

# నిరశనవ్రతం

సార్జెంటును అర్జెంటుగారమ్మని కబురుజేశాడు జైలు గవర్నరు. సార్జెంటు నిమిషాలమీద హాజరై శాల్యూట్ చేసి గవర్నరు ముందు చేతులు జోడించి నుంచున్నాడు.

"ఇదిగో లిస్టుచూడు. ఇందులో నీకు తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారా ?"

"లేరు ప్రభూ"

"జోసెఫ్ బ్రాజ్ (టిటో అసలుపేరు) అనే అతన్ని ఎరుగుదువా ?"

"నేను ఇదివరకెప్పుడూ ఆ పేరు వినలేదండి"

"అయితే ఇక్కడెందుకున్నావు. గాడిదల్ని కాయడానికా ? ఈ గాడిద (బ్రాజ్) మూలాన మా ఉద్యోగాలు ఊడిపోయే రోజులువచ్చాయి"

(సార్జెంటు గడగడలాడుతూ) "అదేమిటి మహాప్రభూ అలా సెలవిస్తున్నారు. ఎవరు ఆ బ్రాజ్"

(గవర్నరు మండిపడుతూ) "ఎవడా ? వాడే. ఆ కమ్యూనిస్టులీడరు"

(సార్జెంటు ఆశ్చర్యంగా) "ఇంకా లీడరెవరండి బాబుగారూ, కమ్యూనిస్టు లీడర్ని ఇదివరకే హతమార్చేశాంగా ?"

"ఒకడుజస్తే లక్షమంది పుడుతున్నారు. ఎంతమందిని చంపినా మిడతలదండులాగా మళ్ళీ పుట్టుకొస్తూనేవున్నారు."

"నిజమేనండి ప్రభూ"

"ఏడ్చినట్లేఉంది నీవ్యవహారం. ఈ గాడిద బ్రాజ్ వస్తూవున్నాడని విని ఖైదీలందరికి మహా సంబరంగావుంది. ఎగిరి గంతులు వేస్తున్నారు."

ఇంతలోనే 46 గురు ఖైదీల్ని జైలుకు తీసుకొని వచ్చారని గవర్నరుకు (జైలు సూపరింటెండెంటు) కబురువచ్చింది.

ఆ ఇద్దరూ ఇంకా కొంచెంసేపు గుసగుసలాడి ఖైదీలదగ్గిరకు వచ్చారు. వెనకటి ఆచారం ప్రకారం గవర్నరు ప్రారంభోపన్యాసం చేశాడు.

ఖైదీలందర్నీ క్రమశిక్షణ కలిగి మెలగమని హెచ్చరించాడు. ఈ జైల్లో మీపప్పులుడకవని బెదిరించాడు. "ఆత్మహత్య చేసుకోవాలనుకుంటారేమో ఆ ఆటలు నాముందు సాగవు" అని నిప్పుదొక్కిన కోతిలాగా అటూఇటూ కాసేపు చిందులు దొక్కాడు. "పారిపోవడానికి ప్రయత్నిస్తారేమో అందుకు తగిన జాగ్రత్తముందే తీసుకున్నాం" అని మీసం దువ్వుకుంటూ జైలుకు చుట్టూ నాలుగువైపుల అమర్చబడిఉన్న మరతుపాకులవైపు కొరచూపులు చూశాడు. ఉపన్యాసం ముగిసింది.

"ఎవరు మీలో జోసెఫ్ బ్రాజ్" అని ప్రశ్నించాడు గవర్నరు. నేనే అని ముందుకువచ్చి నుంచున్నాడు టిటో. సరే, నీవు ఒక్కడివి నాతోపాటురమ్మని గవర్నరు టిటోను వేరే గదిలోకి తీసికెళ్ళాడు. కూర్చోమని ఒక కుర్చీని చూపించి గవర్నరు వెళ్ళిపొయ్యాడు ఇంతలోనే మరో మనిషివచ్చి మాట్లాడకుండా టిటో ప్రక్కన నుంచున్నాడు. ఏవో కొన్ని ప్రశ్నలడగడం కోసం తనను ఇక్కడ కూర్చోమని ఉంటారని టిటో అనుకున్నాడు. కాని ఎంతసేపు చూచినా ఎవరూరాలేదు. "ఎందుకోసం నన్నిక్కడ కూర్చోబెట్టారు" అని టిటో తన ప్రక్కన నుంచున్న మనిషిని అడిగాడు. అతను తనకేమీ తెలియదని సమాధానం ఇచ్చాడు. కూర్చోని కూర్చోని టిటో ప్రాణం విసిగిపోయింది. అసలే ప్రయాణ బడలిక. అందులో రెండురాత్రుల నుంచి కంటిమీద కూర్కు అంటే ఏమిటో ఎరగడు. కండ్లు మూసుకు పోతున్నాయి. నిద్రమైకంతో తల ఒక ప్రక్కకు వాల్చాడు. వెంటనే పక్కన నుంచోనున్న ఆ కావలావాడు లేవగొట్టాడు. టిటో మళ్ళీ కొంచెంసేపు లేచికూర్చున్నాడు. కొంత సేపటికి మళ్ళీ నిద్రవచ్చింది. కావలావాడు మళ్ళీ లేవగొట్టాడు. "ఆఫీసులో నిద్రపోవడం తప్పు" కాబట్టి లేవగొట్టాడేమోలే అనుకున్నాడు టిటో. ఇలాగే నాలుగయిదు సార్లు జరిగింది. టిటో ఇక సహించలేక పొయ్యాడు.

"మీరుజేసే చిత్రవధల్లో ఈ పద్ధతికూడా ఒకటా?" అని మండిపడుతూ అన్నాడు టిటో. "ఇది కొత్తదేమీ కాదు, పాతదే. ఇప్పటికి రెండు సంవత్సరాలనుంచి దీన్ని అమలు పరుస్తున్నాం" అని జవాబు చెప్పాడు కావలావాడు.

టిటో మళ్ళీ కండ్లు మూసుకున్నాడు. ఎంత ఆపినా ఆగకుండా నిద్ర ఊగుతూఉంది. ఇలా లేవగొడితే లాభం లేదనుకొని బొక్కెనతో నీళ్ళు తీసుకొనివచ్చి ఒక్కసారిగా టిటో ముఖంమీద కుమ్మరించాడు. టిటో కూర్చున్న కుర్చీని బైటికి లాగేశాడు. ఆ విధంగా రెండు రోజులు టిటోని నిద్రబోనివ్వకుండా నిలువుగాళ్ళమీద నుంచోబెట్టారు.

అమానుషమైన ఈలాంటి బాధల్ని ఖైదీలు ఎంతోకాలం సహించ లేక పోయ్యారు. ఖైదీలంతా రహస్యంగా సమావేశమై నిరశన వ్రతం చేయడానికి నిశ్చయించుకున్నారు. ఇంతకంటే వేరే గత్యంతరంలేదు అని టిటో ఖైదీలందరికి నచ్చజెప్పాడు. ఈ జైల్లో రెండువేల మంది ఖైదీలు ఈ విధంగా హృదయ విదారకంగా మరణించడం అంటే సామాన్యమైన విషయంకాదు. మనమంతా ఒకే మాటమీద ఒకే పట్టుదలతో ఉంటే చివ రకు ప్రభుత్వం లొంగి తీరుతుంది. ఖైదీలందరు మనస్ఫూర్తిగా సమ్మ తించారు. జైల్లో ఈవిధంగా కుళ్ళి కుళ్ళి చచ్చేదానికంటె నిరశనవ్రతమే మంచిది అని ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నారు. నిరశనవ్రతం ఆరంభ మయింది.

ఈ వార్తవిని గవర్నరు (జైలు సూపరింటెండెంటు) ఉగ్రుడై పోయ్యాడు. ముందు నిరశనవ్రతం మానేస్తేనే కాని మీ డిమాండ్సును గురించి ఆలోచించనని కబురుచేశాడు. ఖైదీలు అందుకు అంగీకరించలేదు. ఖైదీల్లో ముఖ్యులుగా - రింగ్ లీడర్సుగా - ఉన్న పదిమందిని - టిటోతో సహా - వేరే ఒక ప్రత్యేక గదిలోబంధించాడు. ఈ పదిమందిని అమాను షంగా అతిఘోరంగా హింసించారు. వేళ్ళకు గోళ్ళకు మధ్య చిన్నచిన్న మేకులు దిగగొట్టారు. ఒంటిమీద దెబ్బలుకనబడకుండా వుంటానికి యిసుక సంచులతో ఒళ్ళుఅంతా గుల్ల అయ్యేటట్లు బాదగొట్టారు. చరిత్రలో ఇంత వరకెన్నడూ కనివిని ఎరుగని ఘోరాతిఘోరమైన హింసాపద్ధతుల్ని అవ లంబించారు. మరునాడు గదితలుపులు తెరిచిచూస్తే పదిమందిలో ఇద్దరు చచ్చిపడి యున్నారు. తక్కిన ఎనమండుగురు స్పృహలేకుండా శవాల్లాగ పడివున్నారు. స్పృహవచ్చినతర్వాత మళ్ళీ ఆ ఎనమండుగుర్ని ఇసుకబస్తా లతో బాదమోదారు. చేతివ్రేళ్ళను తాడు పేనినట్లుగా మెలికలు దిప్పి

మెలిసివేశారు. తలమీదఉన్న వెంట్రుకలన్నీ పీకేశారు. శరీరమంతా అపాదమస్తకం నెత్తురుముద్దలాగా అయిపోయింది. ఈ రాక్షస కృత్యాల ఫలితంగా మిగిలిన ఎనమండుగురిలో ఇంకా ఐదుగురు చచ్చిపోయారు. స్మృతిలేకుండా పడిపోయివున్న సమయంలో ఎనీమాద్వారా ఖైదీల పేగుల్లోకి ఉప్పునీళ్ళు ఎక్కించారు.

ఈ హత్యాకాండతో జైలంతా గుబగుబలాడిపోయింది. ఖైదీలు తమ నాయకులుపడే ఈ నరకబాధల్ని చూడలేకపోయారు. 'గెలుపునాదే' అని గవర్నరు సంతోషిస్తే సంతోషించనివ్వండి. ఇంతటితో నిరశన వ్రతం మానేద్దాం అని నిశ్చయించుకున్నారు. నిరశనవ్రతం మానేస్తే టిటోను. చావగా బ్రతికిన మిగతాఇద్దర్నీ బాధించను. అని గవర్నరు వాగ్దానముచేశాడు. వ్రతభంగమయినాసరే టిటోని రక్షించుకుందామనుకున్నారు. కాని ఇందుకు టిటో అంగీకరించలేదు. నా ప్రాణంపోతే పోయింది మీరు మాత్రం పట్టినపట్టు వదలకండి అని గట్టిగా పట్టుబట్టాడు. టిటో మాటను తోసివేయలేక పోయారు. నిరశనవ్రతాన్ని కొనసాగించారు. దేశమంతటా బ్రహ్మాండమైన ప్రజాందోళన బయలుదేరింది. చివరకు ఆ మొండిప్రభుత్వంకూడా లొంగక తప్పిందికాదు. గవర్నరుని డిస్మిస్ చేశారు. ఖైదీల కోర్కెలు అంగీకరించబడ్డాయి. ఉపవాస ఫలితంగా జైళ పరిపాలన కొంతవరకు సంస్కరింపబడింది. ఖైదీలకు వ్రాసుకోడానికి చదువుకోడానికి కొన్ని సౌకర్యాలు సమకూరాయి. యుగోస్లేవియా చరిత్రలో ఈ నిరశనవ్రతం సువర్ణాక్షరాలతో రాయదగిన ఒక అపూర్వఘట్టం. ఈ నిరశనవ్రతాన్ని గురించి నేటికీ యుగోస్లేవియా ప్రజలు ఎన్నోకథలు చెప్పుకుంటూ ఉంటారు. న్యాయసమ్మతమైన హక్కులకోసం పోరాడి ప్రాణాల్ని సైతం బలియిచ్చిన ఆ విప్లవమూర్తుల్ని వేనోళ్ళ కొనియాడుతూ ఉంటారు. ఆనాడు జైలు అధికారులు పెట్టిన బాధలవల్ల టిటో ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. మళ్ళీ మామూలు మనిషి కావడానికి తర్వాత నాలుగు సంవత్సరాలు పట్టింది.

---

# అజ్ఞాతవాసం

ఐదు సంవత్సరాల జైలుశిక్ష పూర్తిచేసి 1932 లో టిటో బెల్గ్రేడ్ పట్టణానికి తిరిగివచ్చాడు. ఒక్క సోవియట్ రష్యామినహా మిగతా ప్రపంచమంతా ఆర్థికమాంద్యంతో కుంగిపోతూఉన్న రోజులవి. యుగో స్లేవియా ఆర్థిక పరిస్థితిగూడా పూర్తిగా దెబ్బతిని పోయింది. రైతుజీవితం దుర్భరమయింది. ఒక బండి గోధుమలు అమ్మినా ఒక చెప్పులజత కూడా రావటల్లేదు. అలెగ్జాండర్ రాజు తన దోపిడివిధానాన్ని మరీ తీవ్రతరం చేశాడు. దేశమంతటా ప్రభుత్వ దమన విధానం విచ్చలవిడిగా నృత్యం చేస్తూఉంది. రైల్లో ప్రయాణం చేయాలన్నా పోలీసుల దగ్గరనుంచి పర్మిషన్ తీసుకోవాలి. అలెగ్జాండర్ పరిపాలన ఎంత అధ్వాన్నంగాఉందో తెలియజేయడానికి ప్రభుత్వ న్యాయశాస్త్రంలోనుంచి మచ్చుకొక ఉదాహరణ చూస్తే తెలుస్తుంది.

"కమ్యూనిస్టుపార్టీతో సంబంధం ఉన్నది అని అనుమానం కలిగితే (సాక్ష్యం లేకపోయినా సరే, రుజువుకాకపోయినాసరే) ద్వీపాంతర వాస శిక్ష విధించవచ్చు. లేక ముత్తాత ముదిమనమడు (దూరపుచుట్టరికం) కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయినా సరే మొత్తం కుటుంబానికే ద్వీపాంతర వాస శిక్ష విధించవచ్చు. గ్రామంలోఉన్న కమ్యూనిస్టుల్ని ఆ గ్రామప్రజలే స్వయంగా పట్టుకొచ్చి పోలీసులకు ఒప్పగించాలి. అలా చేయని పక్షంలో మొత్తం ఆ గ్రామాన్నే - ఆబాలగోపాలం అందర్నీ - మరొక ద్వీపానికి లేక ప్రదేశానికి ఎగుమతి చేయవచ్చు. ఈ విధంగా ఖాళీఅయిన గ్రామాలకు రాజభక్తి పరులైన కొత్తప్రజల్ని దిగుమతిచేయాలి."

హిట్లర్ హిమ్లర్ వగైరా ఫాసిస్టు నాయకుల్నికూడా అలెగ్జాండర్ ప్రభుత్వం ఎలా తలదన్ని పోయిందో చూడండి.

ఈలాంటి భయంకరపరిస్థితుల్లో టిటో మళ్ళీ రాజకీయరంగంలో ప్రవేశించాడు. క్రమశిక్షణ కార్యదక్షతలేని లక్షలాది సభ్యులకంటె చక్కని క్రమశిక్షణ కలిగి నిర్మాణయుతంగా పనిజేసే సభ్యులు కొన్ని వందల



గెరిల్లా నాయకురాలు వీరా లిసిన్
తన సహచరులతో



జర్మన్ సైనికులనుండి సంపాదించిన
సైనిక దుస్తులతో ఒక గెరిల్లా సైనికురాలు

మంది అయినాసరే మంచిదే అన్నాడు. "గంపెడు గుల్కరాల్ కలుగు కన్నను రత్నమొకండు చాలదే" అనే సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టాడు. విప్పరవ్వల్లాంటి కొద్దిమంది పార్టీసభ్యులతోనే కార్యక్రమం సాగించాడు. అజ్ఞాతవాసంలో ఉంటూనే కార్మికసంఘాన్ని మంచి కట్టుదిట్టాలతో నిర్మించాడు. ప్రభుత్వ దమన విధానాన్ని అసహ్యించుకునే జాతీయశక్తులన్నింటినీ ఐక్యంజేశాడు.

యూరప్ ఖండ పరిస్థితులు మహా అల్లకల్లోలంగా ఉన్నాయి. జర్మనీలో హిట్లర్ డిక్టేటరు అయ్యాడు. ఇతర దేశాల్లోకూడా ఫాసిస్టు ప్రమాదం నానాటికి పెచ్చు పెరిగిపోతూఉంది. యుగోస్లేవియాలో ఇదివరకే ఫాసిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పిన అలెగ్జాండర్‌ని మాసిడోనియన్ దేశభక్తుడు ఖూనీచేశాడు. అలెగ్జాండర్ కొడుకైన పీటరు 11 సంవత్సరాల చిన్నవయస్కుడు కాబట్టి రాజకార్యాలన్నీ అతని దగ్గిర బంధువైన పాల్ చూస్తూ ఉండేవాడు. అలెగ్జాండర్ పరిపాలనకు, నీతిబాహ్యుడైన పాల్ పరిపాలనకు తేడా ఏమీలేదు. ఇంకా కొంచెం అలెగ్జాండరే మెరుగు అనిపించాడు పాల్. 1917 విప్లవానికి పూర్వం రష్యాలో ఇతనికి పెద్ద పెద్ద ఎస్టేట్లు ఉండేవి. విప్లవానంతరం సోవియట్ ప్రభుత్వం జమీందారీ విధానాన్ని పూర్తిగా రద్దుచేసింది. అందువల్ల పాల్‌కు సోవియట్ ప్రభుత్వమన్నా, కమ్యూనిస్టుపార్టీ అన్నా అరికాలిమంట నెత్తికెక్కుతుంది. ఫాసిస్టు హిట్లర్ని పూర్తిగా బలపర్చాడు. దీన్ని అవకాశంగా తీసుకొని జర్మన్ సి. ఐ. డి. లు మెల్లమెల్లగా యుగోస్లేవియా రక్తనాడుల్లో ప్రవేశించారు. ఆయువుపట్లు పట్టుకున్నారు. రాజ్యాంగ యంత్రంలోని కీలకస్థానాలన్నీ తమ చేతుల్లో ఉంచుకున్నారు.

కమ్యూనిస్టుపార్టీ ఈ ఫాసిస్టు ప్రమాదాన్ని ముందే గుర్తించింది. నాజీ ఎత్తులకు పై ఎత్తులువేసింది. మేధావుల్లోను మధ్యతరగతిప్రజల్లోను విసుగు విరామంలేకుండా ముమ్మరంగా నాజీ వ్యతిరేక ప్రచారాన్ని సాగించింది. అన్ని ప్రభుత్వశాఖల్లోను కమ్యూనిస్టుపార్టీకూడా ఒక బలమైన స్థానాన్ని సంపాదించుకుంది. ప్రభుత్వం చెప్పుచేతుల్లో పనిచేస్తూ ఉన్న ట్రేడ్‌యూనియన్‌లో పై నిరుల్లో పోలీసుల్లోకూడా దూరి పనిచేసింది.

కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన ఈ నూతన విధానం నూటికి నూరుపాళ్ళు జయప్రదం అయింది. ఎటుజూచినా 'కమ్యూనిస్టు భూతమే' ఎదురు అవుతూ ఉంది. ప్రభుత్వానికి తల తిరిగిపోయింది. ఎవరు కమ్యూనిస్టులో ఎవరు కారో తెలుసుకోవడం కూడా కష్టమైపోయింది. సైనికుల్లోను, పోలీసుల్లోను చివరకు పరిపాలన శాఖలోకూడా కమ్యూనిస్టులు జొరబడ్డారని అనుమానం వేసింది. అనుమానం తగిలిన ప్రతివాణ్ని అరెస్టుచేసింది. ఒక్కొక్కప్పుడు మొత్తం డిపార్టుమెంటు మీదనే జులుం సాగించింది. తన కాళ్ళు తానే నరుక్కుంది. ఎటికను పట్టుకోలేక తన కొంపకే చిచ్చుబెట్టుకుంది. ప్రభుత్వదమన విధానం శ్రుతి మించినకొలది ప్రజాస్వామిక శక్తుల్లో అభేద్యమైన ఐక్యత ఏర్పడింది. ప్రజా ఉద్యమాన్ని చూస్తే ప్రభుత్వం పని విప్పదొక్కిన కోతిలాగా అయింది. దేశాన్ని అంతా రక్త ప్రవాహంలో ముంచెత్తింది. ఒక్క టిటోను పట్టుకోడానికి ప్రత్యేకంగా 15 వేల మంది సి.ఐ.డి. ల్ని నియమించింది. ఎన్ని వేలమంది సి.ఐ.డి.లు ఎన్ని వేలకండ్లతో పొంచి చూస్తున్నా, వాళ్ళందర్నీ తప్పించుకుని టిటో నిరాఘాటంగా తన పని కొనసాగిస్తూనే ఉన్నాడు.

---

# ఇంటర్నేషనల్ బ్రిగేడ్

హిట్లరు దండయాత్రకు పూర్వం యూరోపులోజరిగిన మరో మహత్తర విషయం-స్పెయిన్ అంతర్యుద్ధంలో-టిటో ఎంత ప్రముఖపాత్ర వహించాడో తెలుసుకోవడం కూడా ఇక్కడ చాలా అవసరం.

ఇటలీలో ముసోలినీ, జర్మనీలో హిట్లరు అధికారంలోకి రావడంతో ఫ్రాంకోకు కూడా శివం ఎత్తింది. కొత్తగా స్థాపించబడిన ప్రజా

ప్రభుత్వాన్ని కూలదోసి తానుకూడా అధికారంలోకి రావాలని ఫాసిస్టు ఫ్రాంకో అనేక కుట్రలు పన్నాడు. హిట్లరు ముస్సోలినీల సహాయంతో చివరకు బహిరంగంగా యుద్ధానికే దిగాడు. తమ 'చిట్టితమ్ముడు' ఫ్రాంకో సహాయానికి హిట్లరు ముస్సోలినీలు తండోప తండాలుగా ఫాసిస్టు సైన్యాల్ని స్పెయినుకు దిగుమతి చేశారు. ఫాసిస్టులు ఫాసిస్టుకు సహాయం చేస్తూఉంటే స్పెయిన్ ప్రజాప్రభుత్వానికి తోడ్పడడానికి ప్రపంచ ప్రజా హృదయం నూతనోత్సాహంతో ఉప్పొంగి పోయింది. కాని సామ్రాజ్యవాదులు సైంధవుల్లాగ పొంగిపొరలే ఆ ఉత్సాహానికి అడ్డు తగిలారు. ప్రజాస్వామిక వాదులమని చెప్పుకునే ప్రముఖ బ్రిటిష్ రాజకీయ నాయకులు ఇతర్లు జోక్యం చేసుకోరాదు (నాన్ఇంటర్వెన్షన్) అంటూ స్పెయిన్ యుద్ధంతో తమ కేమీ జోక్యం లేదని మడిగట్టుకుని దూరంగా కూర్చున్నారు. ప్రజా ప్రభుత్వాన్ని నాశనం చేయడానికి ఫాసిస్టు మార్గాన్ని సులభం చేశారు. సామ్రాజ్యవాదులు మొదటినుంచి ఫ్రాంకో అనే విష సర్పానికి పాలుబోసి పెంచారు. ఇప్పటికీ పెంచుతూనే ఉన్నారు.

తమకేమీ సంబంధం లేదంటూ సామ్రాజ్యవాదులు చేతులు ముడుచుకొని కూర్చున్నంతమాత్రాన నిజమైన దేశభక్తులు నిరుత్సాహ పడలేదు. స్పెయిన్ ప్రజాస్వామికాన్ని రక్షించడానికి దేశదేశాల్లో ఉన్న దేశభక్తులంతా నడుంబిగించారు. మార్గమధ్యంలోఉన్న అత్యంతరాలన్నిటినీ అతిక్రమించి స్పెయినుకు చేరుకున్నారు. ఫాసిస్టులతో హోరాహోరి పోరాడారు. అనేక మంది అక్కడే తమ అసువుల్ని కోల్పోయారు. దేశభక్తికి భౌగోళిక సరిహద్దులంటూ లేవని ప్రపంచానికి నిరూపించారు. సత్కార్యాచరణకు కులమతాలు, నల్ల తెల్ల భేదాలు, అడ్డు పడవని ఒక మహోత్కృష్ట ఆదర్శాన్ని చాటారు. నవయువకులకు ఒక నూతన ఆశాజ్యోతిని జూపించారు. మూడంతస్థుల మేడల్లో హంసతూలికా తల్పాలమీద పవ్వళించి ఉబుసుపోకకు రాజకీయాలు ముచ్చటించే బూర్జువా నాయకులకు బుద్ధిజెప్పారు. ఇంతవరకు చరిత్రలో కనివిని ఎరుగని ఒక మహోన్నతమైన ఆదర్శాన్ని ప్రపంచం ముందు ఉంచారు. స్పెయిన్ యుద్ధరంగంలో వివిధ దేశస్థుల, వివిధమతస్థుల రక్తం కలిసి కాలువలై కట్టింది. నాయ

కులు సైనికులు ఒకే ఆదర్శంకోసం ఒకే సిద్ధాంతంకోసం—దుష్టుల్ని శిక్షించి సిష్టుల్ని రక్షించి ధర్మసంస్థాపనార్థం- కత్తులుదూశారు. వీరవిహారం చేశారు. ప్రాణాల్ని బలియిచ్చారు. ఇంగ్లండులో సుప్రసిద్ధ-రచయిత అయిన రాల్ఫ్ఫాక్స్ అందరికంటె ముందుండి పరోపకార్థం ఆహుతి అయ్యాడు. ఇండియాలో సుప్రసిద్ధ రచయిత ఐన ముల్కురాజ్ ఆనంద్ కలానికి బదులు కత్తిబట్టి స్వయంగా యుద్ధరంగానికురికాడు. యుగోస్లేవియా ప్రజానాయకుడైన మార్షల్ టిటో స్పెయిన్ ప్రజా ప్రభుత్వాన్ని రక్షించేఅందుకు తనసర్వశక్తులూ దారపోశాడు. ఇలాంటి యోధానయోధులతో కూడుకొనిన ఇంటర్నేషనల్ బ్రిగేడ్ చరిత్ర ప్రపంచ చరిత్రకే వన్నె తెస్తుంది. మానవాదర్శానికి మెరుగులు దిద్దుతుంది. సమస్త ప్రజానీకానికి ప్రాతఃస్మరణీయం అవుతుంది. ప్రస్తుతం టిటోవిషయానికి వద్దాం.

స్పెయిన్‌లో అంతర్యుద్ధం ఆరంభమైన వెంటనే తన కర్తవ్యమేమిటో నిర్ణయించుకున్నాడు కామ్రేడ్ టిటో. ప్రజాప్రభుత్వాన్ని సమర్థించి అన్నివిధాల సహాయం చేయడమే ప్రతి ప్రజాస్వామికవాది కర్తవ్యం అని దేశమంతటా తీవ్రంగా ప్రచారంచేశాడు. ప్రజాప్రభుత్వాన్ని రక్షించడానికి ప్రాణానికికూడా తెగించి అనేక వేలమంది యువకులు నడుంబిగించి ముందుకు వచ్చారు. ఈ వేలకొలది వీరయువకుల్ని యుద్ధరంగానికి పంపించడంఎలా? వీరందరికి రైలు ఖర్చులు ఎక్కడనుంచివస్తాయి? పోనీ, ప్రజలనుంచి చందారూపంగా డబ్బు వసూలు జేసినా స్పెయిన్‌కు వెళ్ళడానికి ప్రభుత్వం పర్మిషన్ ఇవ్వదుగదా? కాబట్టి ఈ పని అంతా రహస్యంగానే జరగాలి. ఏమిటి మార్గం?

అడవుల్లోగుండా కొండల్లోగుండా తప్పించుకొని కొందరు ప్రాన్సు చేరుకున్నారు. పారిస్ ఎగ్జిబిషన్ (ప్రదర్శనశాల) చూడటానికి అనే మిషతో కొందరు పాస్‌పోర్ట్లు తీసుకున్నారు. మరికొందరు మారురూపాలతో మారుపేర్లతో వచ్చి కలుసుకున్నారు. ఎలాగయితేం అందరూ ఏదో విధంగా ప్రాన్సు చేరుకున్నారు. స్పెయిన్ ప్రజాప్రభుత్వానికి బుద్ధిపూర్వకంగా సహాయం చేయడానికి సిద్ధమై యూరప్‌లోని వివిధ దేశాలనుంచి వేలకొలది నవయువకులు ముందుకువచ్చారు. వీరిలో ఇంగ్లీష్, జర్మన్,

డచ్, ఫ్రెంచ్, అమెరికన్, ఇటాలియన్, రుమేనియన్, బల్గేరియన్, ఇండియన్ గ్రీక్, జెక్ వగైరా అనేక జాతులవారు ఉన్నారు. వీరందర్నీ స్పెయిన్‌కు పంపించడం ఎలా? ఇదే పెద్ద సమస్య.

స్పెయిన్‌కు వెళ్ళడానికి ఫ్రెంచి ప్రభుత్వం పర్మిషన్ ఇవ్వదు. సరిహద్దులమీద ఫ్రాంకో బంట్లు దెయ్యాలలాగా ఇరవైనాలుగు ఘంటలూ కాపలాగాస్తూ ఉంటారు. ఎంతకాలం కాపలాగాస్తూఉన్నా వాళ్ళకండ్లల్లో దుమ్ముగొట్టి కొందరు స్పెయిన్‌లో ప్రవేశించారు. మరి కొందరు ఫ్రాంకో తరపున పోరాడటానికి వాలంటీర్లుగా వెళ్లుతున్నామనిచెప్పి ఫ్రెంచి పోలీసుల నెత్తిన టోపీ బెట్టారు.

ఫ్రెంచ్ రేవుల్లోకి చైనా ఓడలు తరచుగా వస్తూఉంటాయి. ఇంటర్నేషనల్ బ్రిగేడ్ సభ్యులు మెల్లగా ఒక ఓడను పట్టుకున్నారు. ఓడలోని నావికులు ప్రయాణీకులు అంతా చైనా దేశస్థులమే అని రిజిష్టరు చేయించుకున్నారు. ఈ విధంగా ఎత్తులతో అనేకమంది స్పెయిన్‌లోకి జొరబడ్డారు.

టిటో నాయకత్వంకింద ఈ వీరులు హోరాహోరీగా పోరాడారు. స్పెయిన్ అంతర్యుద్ధంలో గడించిన అనుభవం భావిజీవితంలో టిటోకి ఎంతో ఉపయోగించింది. ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లో పోరాడిన వీరులే ముందు యుగోస్లేవియా స్వాతంత్ర్య పోరాటంలో నాయకత్వం వహించారు. మాతృభూమిలో సంపూర్ణ ప్రజాస్వామికం స్థాపించి యావత్ప్రపంచానికి ఆదర్శప్రాయు లయ్యారు.

కృతజ్ఞతా సూచకంగా కామ్రేడ్ డైజ్ (స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ సెక్రటరీ) టిటోతో ఇలా అన్నాడు.

"అద్భుతంగా పనిజేశారు. మీరు మా కంటె ఎంతో ముందున్నారు. మెరికల్లాంటి కమ్యూనిస్టుల్ని మా దేశానికి పంపించి మీరు మాకెంతో తోడ్పడ్డారు. ఈ పోరాటంలో ఆరితేరిన వీరులు ముందు మీ స్వాతంత్ర్య పోరాటానికి ఎంతో ఉపయోగపడతారు. నాయకత్వంవహించి దేశాన్ని నడపగల రత్నాల్లాంటి అనేకమంది యువకులు ఇక్కడే బలి అయిపోయినందుకు ఎంతో విచారంగా ఉంది."

ఇందుకు టిటో ఇచ్చిన సమాధానం ఇది,

" పశ్చిమ యూరప్ ఖండవాసులైన మీకు మా బాల్కాన్ దేశస్థుల్ని గురించి ఏవో కొన్ని విచిత్రభావాలుంటాయి. మేము చాలా వెరాడంబరంగా ఉంటాం. మీ ప్రజలకంటె మా ప్రజల్లో చాలా ఎక్కువ బీదతనం ఉంది. ఆ బీదప్రజల శక్తితోనే మేము మా స్వాతంత్ర్యాన్ని సాధించాలి. స్పెయిన్ పోరాటంలో అనేకమంది వీరులు చచ్చిపోతున్నారే అని చావిరం కలగడం సహజం. కాని మా వెనకఉన్న ప్రజలుకూడా మా లాంటివాళ్ళే. ధైర్య సాహసాల్లో మా కేమీ తీసిపోరు. ఒకళ్ళుజస్తే పది మంది సిద్ధంగాఉన్నారు ముందుకు రావడానికి. మా నాయకులుకూడా ప్రజా సామాన్యంలోనుంచి వచ్చిన మామూలు రైతుబిడ్డలు, కూలీ బిడ్డలే. సమయం వచ్చినప్పుడు, ఆ రైతు కూలీల్లోనుంచే వందలకొలది మహా నాయకులు తయారవుతారు. కాబట్టి ఎవరో కొద్దిమంది ఇక్కడ చనిపోయినంత మాత్రాన మా స్వాతంత్ర్య పోరాటం బలహీన పడదు. ఇంకా బలపడుతుంది. ప్రజాశక్తి అపారమైనది. ఇసుక పాతరలాగా తీసినకొద్దీ వస్తూనే ఉంటుంది. "

యుగోస్లేవియా స్వాతంత్ర్య పోరాటంలో ఆ నాడు టిటో జెప్పిన ప్రత్యక్షరం ప్రత్యక్ష సత్యం అని చరిత్రే రుజువుచేసింది.

---

# హిట్లరు

1941 ఏప్రిల్ 6 వ తేదీ తెల్లవారుఝామున మిడతల దండులాగా వచ్చి నాజీ విమానదళాలు బెల్గ్రేడ్ పట్టణంమీద బాంబులవర్షం కురిపించాయి. హిట్లరు దాడి ప్రారంభమయింది. ఈ యుద్ధకాలంలో హిట్లరు సాగించిన ఘోర విమానదాడుల్లో ఇదొకటి.

నాజీ బెదిరింపులకు లొంగకుండా దేశరక్షణకు నడుంకట్టారు యుగోస్లేవియా ప్రజలు. హిట్లరు ఇంతకు పూర్వం అనేక దేశాల్ని గెల్చాడు. కాని ప్రాణం ఉన్నంతవరకు తెగించి స్వాతంత్ర్యంకోసం పోరాడే ప్రజల్ని ఎదుర్కోలేదు హిట్లరుకి ఇదొక నూతన అనుభవం.

మొదటి నాజీ విమానదాడికే యుగోస్లేవియా రాజధానిపట్టణం బెల్గ్రేడ్ అధికభాగం భస్మీభూతం అయిపోయింది. ఈపరిస్థితుల్లో వెంటనే బెల్గ్రేడ్ పట్టణంవదలి అడవుల్లోనే అజ్ఞాతంగా ఉండి రహస్యోద్యమాన్ని సాగించడం మంచిదని టిటో అనుచంవర్గం నిర్ణయించుకుంది. ఇంతకు పూర్వం పది సంవత్సరాలనుంచి రహస్యోద్యమం సాగిస్తూఉన్న టిటోకు ఆ కొండలు అడవులు అన్నీ చిరపరిచిత స్థలాలే. ఇది వరకు తాము సేకరించిన ఆయుధాలన్నిటినీ అడవిలో ఒకచోట భద్రంగా దాచారు. శత్రువులు ఎవళ్ళయినా వస్తూఉన్నట్లు ఆచూకీ తెలిస్తే వెంటనే ఆ ఆయుధాగారాన్ని ప్రేల్చివేయవలసిందిగా కాపలావానికి ముందే ఉత్తరువులిచ్చారు. కాపలావాడుకూడా ఆయుధాగారంతో పాటు దగ్ధమై పోవలసిందే. అయినా అందుకు అందరూ సిద్ధమే.

ఈ పరిస్థితుల్లో ఏ విధంగా ప్రతిఘటనోద్యమం సాగించాలో మిత్రులతో సవిస్తరంగా చర్చించాడు టిటో. అన్ని జాతీయశక్తులతో ఘనిష్ఠ సంబంధం ఏర్పరుచుకోవాలి. ఆయుధాల్ని వెంటనే సేకరించాలి. ప్రతిఘటనోద్యమాన్ని దేశంలో మూలమూలకూ వ్యాపింపజేయాలి. రహస్యంగా రాకపోకల సౌకర్యాలు నిర్మించుకోవాలి. ఈ కార్యక్రమాన్ని దిగ్విజయంగా నెరవేర్చడానికి టిటో మొదలైన కొందరు ప్రముఖులు బెల్గ్రేడ్ లోనే ఉండడం అవసరం అని నిశ్చయించుకున్నారు. ముఖ్యమైన ఫైల్సు డాక్యుమెంట్సు అన్నీ అక్కడే ఒక సురక్షిత స్థలంలో దాచివేశారు. కొందరు ప్రాణ మిత్రులతో పాటు టిటో కూడా ప్రయాణమై బెల్గ్రేడ్ చేరుకున్నాడు.

హిట్లరు సాగించిన మెరుపు యుద్ధపు మొదటి దెబ్బకే దేశం పూర్తిగా లొంగిపోయింది. నాజీ విమాన దాడులవల్ల పట్టణంలో విపరీతమైన నీటి కరువు ఏర్పడింది. నీరు సప్లయిచేసే నూతులు పూడి

పోయ్యాయి. ఇంజన్లు చెడిపోయాయి. పంపులన్నీ పనిచేయకుండా ఆగిపోయాయి. నీటికోసం పట్టణమంతా గగ్గోలెత్తిపోయింది. డాన్యూబ్ నదిలో ఉన్న మురికి నీటినే లారీలతో తోడుతూ ఉన్నారు. చుట్టుప్రక్కలనున్న పల్లెటూళ్ళనుంచి లారీలతో నీళ్ళు తీసికొని రావడానికి జర్మన్ అధికారులనుంచి క్రామేడ్ మెచాక్ కూడా పర్మిషన్ సంపాదించాడు. యుగోస్లేవియా ప్రజలు మనః పూర్వకంగా తమకు తోడ్పడుతూ ఉన్నందుకు జర్మన్లు ఎంతో సంతోషించారు. ఎగిరి గంతులేశారు. వాళ్ళపని వాళ్ళు చేసుకుంటూ ఉంటే వీళ్ళపని వీళ్ళు చేసుకుంటూ ఉన్నారు. పల్లెటూళ్ళనుంచి మంచినీరు సప్లయి చేస్తూఉన్నందుకు జర్మన్లు మెఛాక్ లారీకి అడిగినంత పెట్రోల్ ఇస్తూ ఉండేవాళ్ళు. ఈ లారీద్వారా అనేక ఆయుధాల్ని గెరిల్లాలు తమ రహస్య ప్రదేశాలకి చేర్చగలిగారు.

విజయ గర్వోన్మాదం తలకెక్కి కిన్నూ మిన్నూ గానని నాజీ రాక్షస మూకలు 1941 జూన్ 22 వ తేదీన సోవియట్ రష్యామీద విరుచుక పడ్డాయి. అఖండబల సంపన్నమై అశేష పీడిత ప్రపంచానికి ఆశాజ్యోతి అయిన సోవియట్ రష్యా కూడా జర్మనీతో పోరాడుతూ ఉంది అనగానే యుగోస్లేవియా గెరిల్లా సైన్యాలకి కూడా ఎక్కడ లేని హుషారు వచ్చింది. తన ప్రధాన బలగాన్ని అంతటినీ హిట్లరు ఒక్క రష్యామీదనే కేంద్రీకరించాడు. పావలిచ్ అనే ఒక తొత్తును యుగోస్లేవియాకు ప్రభువుగా జేశాడు. శవంకోసం గుంటదగ్గిర పొంచికూర్చునే నక్కలాగా వలస దేశాలకోసం గుటకలుమింగే ఇటలీ నాయకుడు ముసోలినీకి కొన్నిభాగాలు స్వాధీనంజేశాడు. తన కీలుబొమ్మలైన బల్గేరియన్ హంగేరియన్ ప్రభుత్వాలకి మరికొన్ని ప్రాంతాల్ని లంచంగా ఇచ్చాడు. వీటి అన్నిటి ఫలితంగా ప్రజల్లో అసంతృప్తి మరీ విపరీతంగా పెరిగిపోయింది. అడవినంతా ఒక్కుమ్మడి చుట్టుముట్టి దగ్ధంజేసే దావాగ్నిలాగా దేశమంతటా విప్లవ జ్వాలలు తీవ్రంగా చెలరేగాయి.

జాతీయ నాయకుడుగా ప్రజలందరిచే గౌరవింపబడే డాక్టర్ ఇవాన్‌తో కలసి టిటో సంప్రదించాడు. ఫాసిస్టు జర్మనీని ఎదిరించి పోరాడాలి అనే విషయంలో ఇద్దరూ ఏకాభిప్రాయానికి వచ్చారు. వెంటనే ఒక ఒడంబడిక



గెరిల్లా సైనికులు బోస్నియాలో ఒక తీవ్రయుద్ధం తర్వాత విశ్రాంతి తీసుకొనుచున్నారు.



**గాయపడిన గెరిల్లా యోధులు. ఇటలీలోని మిత్రమండలి వైద్యశాలలోనున్న దృశ్యం.**

చేసుకున్నారు. తదితర ప్రజాస్వామిక వాదులతోకూడా సంబంధం ఏర్పరచు కున్నారు. గెరిల్లా సైనికులసంఖ్య ఉరుకులతో పరుగులతో పెరిగి ఒక బ్రహ్మాండమైన శక్తిగా తయారయింది. అన్ని పార్టీలు కలిసి చర్చించి ఒక ప్రణాళికను తయారుచేశాయి. మరునాడు ఉదయం నగరంలో ఎక్కడ చూచినా "ప్రజలందరు వచ్చి గెరిల్లా సైన్యంలో చేరండి" అని రాసిన కాగితాలు ప్రత్యక్షమయ్యాయి.

గెరిల్లా సైన్యం అంటే జర్మన్ సైన్యానికి గుండెలో గాలమైంది. ఏరాత్రిపూట ఎటునుంచివచ్చి మీదబడతారో అని హడల్. కూర్చున్నా, మంచున్నా, సింహస్వప్నం. ఏమూల ఎవరుకూర్చున్నారో, ఎక్కడ బాంబులు పూడ్చిపెట్టారో, వంతెనమీదగా నడుస్తూవుంటే ఎప్పుడు ప్రేల్చి వేస్తారో, త్రాగేపాలల్లో, తినే రొట్టెల్లో ఏమి కలుపుతున్నారో, ఎవర్ని నమ్మాలి, ఎవర్ని నమ్మకుండా ఉండాలి. ఏ పొదలో దాగి ఉంటారో, ఏ చెట్టుమీద ఎక్కికూర్చుంటారో,.........వక్కలో బల్లెంగా ఉంది. ఎది రించి యుద్ధంచేద్దామా అంటే ఎక్కడా కన్పడరు. ఏం చెయ్యాలి! జర్మన్ల కంతా అయోమయంగా ప్రాణసంకటంగా ఉంది.

యుగోస్లేవియా స్వాతంత్ర్య పోరాటం ప్రపంచ చరిత్రలో సువ ర్ణాక్షరాలతో రాయదగిన ఘట్టం. ఆయుధాలు తక్కువగా ఉన్నప్పుడు ఇటాలి యన్ బెటాలియన్లతో పోరాడి ఓడించి వాళ్ళదగ్గిర ఉన్న ఆయుధాలు లాక్కొని జర్మన్ సైన్యాన్ని ఎదిరించేవాళ్లు. "శత్రువులు అజాగ్రత్తగా ఉన్నప్పుడు హఠాత్తుగా వాళ్ళమీద దండయాత్ర చేయడం, శత్రువులు ఎదిరించి యుద్ధంజేస్తే ప్రాణనష్టం గాకుండా మెల్లమెల్లగా తప్పించు కోవడం" ఇదే గెరిల్లా పోరాట ప్రధానసూత్రం. 1942—43 మధ్య అనగా సుమారు ఒక సంవత్సర కాలంలో మొత్తం యుగోస్లేవియా దేశంలో మూడింట రెండువంతుల భూమిని గెరిల్లాలు ఆక్రమించుకున్నా రంటే ఇది ఎంత మహత్తరమైన విషయమో ఆలోచించండి. ఈ పోరా టంలో టిటో సైన్యం అనేక కష్టాలకు గురిఅయింది. అనేక అభ్యంత రాల్ని అతిక్రమించింది. టిటోసైన్యం అల్పసంఖ్యాకం. హిట్లరుకున్న ఆధునిక మారణయంత్ర సామగ్రి - విమానాలు టాంకులు వగైరా-టిటోకు

లేవు. టిటో సైన్యానికి ఒక్కొక్కప్పుడు రెండుమాసాలవరకు తిండికూడా ఉండేదికాదు. అనేకసార్లు పచ్చి మాంసంతోను, అడవిలో దొరికే ఆకూ అలంతోను, పొట్టనింపుకునేవాళ్లు. ఒక్కొక్కప్పుడు తాగడానికి నీళ్ళు కూడా దొరికేవికావు. మందులు మాకులసంగతి ఇక వేరే చెప్పనక్కర్లేదు. వీటి అన్నిటికీతోడు వెనుకనుంచి చెట్నికులు (ఉస్తాషీలు. ఒకప్పుడు అభివృద్ధి కరంగా ఉండి ఇప్పుడు దేశద్రోహులుగా మారారు. హిట్లరుకి ఏజెంటుగా ఉండి పనిచేసిన మిహిలోవిచ్ వర్గీయులు వీళ్ళనాయకులు) దొంగపోటు పొడుస్తూ ఉండేవాళ్లు. ఎన్నికష్టాలువచ్చినా లెక్కచేయకుండా మాతృభూమి స్వాతంత్ర్య సంపాదనార్థం ప్రాణాల్ని తృణప్రాయంగాఎంచి 40 డివిజన్ల శత్రుసైన్యంతో ఒంటరిగా నిల్చి హోరాహోరి పోరాడి విజయాన్ని సాధించారు. ఇంతటి అపూర్వఘట్టం ఇంతవరకు చరిత్రలో ఎప్పుడూ జరిగిఉండలేదు. గెరిల్లా సైన్యాన్ని బందిపోటు దొంగలని దూషించిన కరుడుగట్టిన సామ్రాజ్యవాది చర్చిల్‌కూడా చివరకు "భళిభళీ, సెబాస్" అన్నాడు. పరాకోటికి చెందిన దేశభక్తి అంటే ఏమిటో టిటో సైన్యం ప్రపంచానికి చాటిచెప్పింది. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణలు చూస్తే ఈ విషయాన్ని ప్రతివాడూ అంగీకరిస్తాడు.

మిలోరోడ్ ఒక పరమ బీదకుటుంబీకుడు. క్రాంజ్‌పట్టణంలోని ఒక ఫ్యాక్టరీలో రాత్రిపూట కాపలాగాస్తూ ఉండేవాడు. అతనికి నెలకు 28 రూపాయల జీతం ఇచ్చేవాళ్లు. చాలీచాలని ఆ స్వల్పజీతంతో ఒకపూట తినీ తినక ఏదోవిధంగా గుట్టుగా కాలం గడుపుతూ ఉండేవాడు. చాలా అమాయకుడు. కల్లా కపటూ లెరుగని మనిషి. రాజకీయాలగొడవే తెలియదు.

ఇంతలో నాజీ దండయాత్ర ప్రారంభమైంది. క్రాంజ్‌పట్టణం జర్మనీ వశం అయింది. ఫాసిస్టుసైనికులు పట్టణాన్ని తమ ఇష్టంవచ్చినట్లు దోచుకున్నారు. ఆహారసామగ్రి లూటీజేశారు. ధనధాన్యాదులు కొల్లగొట్టారు. ఈ బీభత్సానికి సహించలేక ఒక జర్మను సైనికుణ్ని ఎవరోకాల్చేశారు.

ఈ వార్తతెలిసి నాజీ కిరాతులు మండిపొయ్యారు. పదిమంది గ్రామస్థుల్ని పట్టుకున్నారు. జర్మన్ సైనికుణ్నిజంపిన హంతకుణ్ని ఇరవై

నాలుగు ఘంటల్లో పట్టి చంపలేకపోతే ఈ పదిమందిని నడిబజారులోనే ఉరితీస్తామని ప్రకటించారు.

నాజీ కిరాతులుజేసే రాక్షస కృత్యాలన్నీ మిలోరాడ్ కండ్లారా చూశాడు. తన ప్రాణం పోయినాసరే ఫాసిస్టు మృగాల్ని నాశనం చేయాలిసిందే అనుకున్నాడు. కాని తననుంచి ఏమిఅవుతుందా అని సందేహించాడు. ఒక చక్కని ఉపాయం తట్టింది. "నాజీలు అరెస్టుజేసిన పదిమందిని విడుదల చేయించే పక్షంలో దేశరక్షణకు వాళ్ళెంతో తోడ్పడగలరు. తాను చేయలేని అనేక పనుల్ని వాళ్ళు చేయగలరు. జర్మన్లకు వ్యతిరేకంగా వాళ్ళు బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించగలరు. నాజీ రాక్షసుల్ని నాశనంచేసి దేశాన్ని రక్షించగలుగుదురు" అని ఆలోచించుకున్నాడు. వెంటనే వెళ్ళి బుద్ధిపూర్వకంగా ఫాసిస్టుల వశమయ్యాడు. "జర్మన్ పైనికుణ్ని చంపింది నేనే" అని గంభీరంగాచెప్పాడు. "అయితే నీకు తుపాకి ఎక్కడిది?" అని ప్రశ్నించారు. "నేను ఫ్యాక్టరీముందు కాపలాగాస్తూ ఉండేవాణ్ని. ఫ్యాక్టరీలోఉన్న తుపాకిని రహస్యంగా దొంగిలించాను" అని జవాబిచ్చాడు. "నీతోపాటు ఇంకా ఎవరు ఉన్నారు?" "ఎవరూలేరు నేనొక్కణ్నే"

మరునాడు ఉదయం ఆ మిలోరాడ్‌ను మార్కెటు ముందు నడిబజారులో ప్రజలందరు చూస్తూ ఉండగా పబ్లిక్‌గా ఉరితీశారు. మిలోరాడ్ మెడలో "ఈ పంది 'రీచ్' కు వ్యతిరేకంగా పనిజేసింది." అని రాసిన ఒక అట్టను వ్రేలాడగట్టారు. ఉరిదీసిన మిలోరాడ్ శవాన్ని పురజనులకు బుద్ధి జెప్పడానికి వారంరోజుల వరకు అక్కడనుంచి తొలగించకుండా అలాగే వేలాడుతూ ఉండనిచ్చారు.

దేశంకోసం తన ప్రాణాన్ని బలిపెట్టిన ఆ మహావీరుని శవాన్ని చూచి బహిరంగంగా కాకపోయినా అంతరంగికంగా నయినా లక్షలాది ప్రజలు నమస్సు లర్పించారు.

---

# బ్రతికేవారికే

యుద్ధం తీవ్రంగా సాగుతూనేఉంది. ఫాసిస్టులు మరీ రెచ్చిపోయినారు. ఫాసిస్టులను బలపరుస్తున్న మిహిలోవిచ్ ముఠాకూడా టిటో దళాన్ని, దేశభక్తులను ఆఖరుదెబ్బ తీయటానికి ప్రయత్నించాయి. దేశభక్తి దళాలను నేలమట్టంచేయ బ్రిటను తమనే బలపరుస్తుంది కదాయని ఆశ రేకెత్తింది. అంతా కలసి టిటో ప్రధాన కార్యాలయాన్ని దగ్ధం చేయాలెనని తలంచారు. వెదకి వెదకి కొండలలో, గుహలలోవున్న ప్రధాన కార్యాలయం ఆచూకీతీసి జూన్ నెల ఆరవతేదీ టిటో కార్యాలయంపై శత్రువులు బాంబులవర్షం కురిపించారు. ఈ సమయంలో ప్రధానకార్యాలయంలో టిటో చాలా స్వల్పసైన్యంతోను ఆయుధాలతోను ఉన్నాడు. టిటో పాత స్నేహితుడు, నేడు దేశభక్త దళంలో కలనల్‌గా పనిచేస్తున్న వాడిమీర్ దేదర్, అతని భార్య డాక్టరు స్త్రీ దళాధిపతి మేజరు ఓల్గా ఆ ప్రధాన కార్యాలయంలో ఉన్నారు. ఒకరిద్దరికన్న యితర సైనికులులేరు. ఓల్గా స్వతంత్ర పోరాట దళంలో డాక్టరుగా అందరికి కట్లుకట్టడం, మందులివ్వడం, వైద్యసేవ చేయడం మాత్రమేగాక యుద్ధంలో తుపాకి తీసుకొని శత్రువును పరిమార్చడం, టాంకు తీసికొని నడిపి శత్రుశిబిరాలను నేలమట్టం చేస్తున్న ధీరురాలు. ఈ మకాంలో అప్పటికి రెండు రోజులనుండి రొట్టిలేదు. నెలల కొలది విశ్రాంతి లేకుండా ఎడతెరపి లేకుండా శత్రువులను తరుముకుంటూ పోరు సాగిస్తూవచ్చారు. తిండిలేక,మందుగుండు సామానులేక,ఆయుధాలు లేక కార్యాలయం ఒంటరిగా నిలచిపోయింది.

అంతవరకు మీదపడి పోరు సాగించిన కార్యాలయదళం ఆత్మరక్షణకై పోరు సాగించవలసివచ్చింది. పురోగమనం సాగించిన దళం తిరోగమనం చేసి తీరవలసి వచ్చింది. అయినా వ్యవధిలేదు. శత్రువు వెన్నంటి దాడిసాగిస్తున్నాడు. అన్నివైపులనుండి సప్లయిలు, రహదారులు అరికట్టబడినవి. ఇంకా పైనుండి బాంబులవర్షం క్షోణీపాతంగా కురుస్తున్నది. అయినా తమకు తోచిన ఎత్తులతో వ్యూహాలుపన్ని 24 గంటలు పోరు

సాగించారు. పురోగమనంచేసి శత్రుమూకల నాపివేసి, తిరిమి మరల తిరోగమనంలో ఆఫీసులో నిలచిపోయినారు. నీరుకూడా లేదు.

కలసల్ దేదర్ తల పగిలింది. కట్టు కట్టడానికి గుడ్డలేదు. వేయ డానికి మందులేదు. కబురుచేసి తెప్పించే అవకాశంలేదు. శత్రుపరివారం కాపులు కాచింది. ఆకులువేసి కట్టు కట్టారు. ఆకులు నిలవలేదు. తడిచేయ వలసివచ్చింది. తడికి నీరేది? నోటిలో వున్నతడే నీరయింది. ఉమ్మితో ఆకులను తడిపి అంటకట్టి పచ్చికొమ్మలతో కట్టుకట్టారు.

ఇక ఓల్గా - ఎడమచెయ్యి చిల్లులుపడిపోయింది. రక్తం చిమ్మిచ్చి వేస్తున్నది. శరీరంలోవున్న రక్తం వరదలు గట్టిపోతూవుంది. కట్టుకు వస్తువు లేమున్నవి? తోడి దేశభక్తులు తమ చొక్కాలుచింపి ఆ పేలిక లతో కట్లు కట్టసాగారు. ఎన్నికట్లు కట్టినా గుడ్డలు ముద్దలయిపోతున్నవి. ఇంతలో మరల శత్రుమూకలు దాడి ప్రారంభించినవి. కదలకుండా కూర్చుంటానికి వీలులేదు. శత్రుమూకలు మరీ విజృంభించినవి.

ఇక ప్రధాన కార్యాలయం ఖాళీచేసి తిరోగమనం సాగించవలసి వచ్చింది. సాగించినా అన్నివైపులా శత్రువులు కావలాకాచి యున్నారు. ఈ టిటో సైన్యానికి మిగతా సైన్యాధిపతులకన్న కొండలలోని తిరుగుడు మరుగుడు దారులు తెలుసు - తెలిసినా లాభం మాత్రం శూన్యం. ఆయుధాలులేవు 2 నెలలనుండి ఆహారంలేదు. వీరావేశం వచ్చింది. ప్రాణా లతో చిక్కకూడదని నిశ్చయించు కున్నారు.

ఆఫీసు రికార్డు అనవసర మైనదానిని తగులవేసి, అవసరమైన ప్రధాన రికార్డును కట్టలుకట్టి ప్రాణాలతోగాని, ఈ రికార్డుతోగాని శత్రువు లకు చిక్కకూడదని ప్రతిజ్ఞ తీసుకొన్నారు. శిబిరంలోనున్న ఇద్దరు ముగ్గురుతో టిటో, దేదర్, ఓల్గాలు బయలుదేరారు. ఓల్గా రక్తం స్రవించి పోతూన్నది. నడిచే శక్తిలేదు. మోసేటందుకు గుఱ్ఱాలుగాని కంచరగాడి దెలుగాని లేవుకదా - కనీసం మనుషులుకూడా లేరు. ఆమె కట్లతో, రక్త స్రవంతితో నడుస్తూ అపుడపుడు దేదర్ మీద మోపుచేస్తూ నడవసాగింది. తిండిలేదు. నీరులేదు. ఒకరోజు. రెండురోజులు...ఇట్లా తొమ్మిదిరోజులు, నడిచి నడిచి వేసారి పోతున్నారు. తిండీ నీరేకాదు విశ్రాంతి తీసికోవడా

నికికూడా సావకాశంలేదు. శత్రుమూకలు తరుముకుంటూ వస్తూనే ఉన్నవి. ఓల్గాకు ధనుర్వాతం కమ్మింది. ఆమె డాక్టరు కదా-ఆలోచించింది. చేతి కెక్కిన ధనుర్వాతం వంటికంతా ఎక్కుతుందని తెలుసుకుంది. ఆ తర్వాత యేమిచేసినా లాభంలేదు. తనను వదలి మిగతావారు సాగిపోవడానికి వీలు లేదు. తాను వారి గమనానికి ప్రతిబంధకం అయింది.

వాతం పోట్లు పొడుస్తున్నవి. డేదర్‌ను పిలిచి ఇక లాభంలేదు చేయినరికివేయమన్నది. నరికివేయడం ఎట్లా. శస్త్రాలా, శస్త్రశాలలా, మత్తు మందులా, రంపమా-ఏముంది. నిండుప్రాణి అలసిపోయిఉంది. శస్త్రచికిత్సకు ఆగగలదా. అనుమానిస్తున్నాడు. మళ్ళాపిలిచింది. యుద్ధంమధ్యలో దేశరక్షలో అవకాశా లెక్కడ లభిస్తవి. ఉన్నవాటితోనే కల్పించుకోవడమే దేశభక్తి. దేశరక్షణా అని ఉద్బోధించింది. డేదర్ చేతిలో శత్రుమూకలను నరకటానికి మిగిలిన కత్తిఉంది. తాను ప్రక్కనే ఉన్న రాతిబండమీద చేయిపెట్టింది. అతన్ని కత్తితీసుకొని నరికివేయమంది. డేదర్ హృదయం స్తంభించిపోయింది. ప్రేమైక నిధానమగు ఓల్గాను, తనకు ఎడమ భుజమగు ఓల్గాభుజాన్ని, తన దేశరక్షణలో ప్రధానరక్షణ బాధ్యతను తీసికొన్న మేజరును, యుగోస్లేవియా స్వాతంత్ర పోరాటంలో రక్తం చిందిస్తున్న దేశభక్తురాలిని ఏమి చెయ్యాలె. కుడిభుజం నరికివేయవలసిందేనా ? ఆలోచనచేస్తూ, దిగులుపడుతూ కూచుంటే శత్రుమూకలు వెంటనంటుతున్నయి. కదిలిపోతే ఈ వాలుగల రాయికూడా లభిస్తుందో లేదో - ఓల్గా దేశభక్తిని ప్రబోధిస్తుంది. సైనికుడుగా నిర్వహించ మంటున్నది. ఓల్గాలో దేశభక్తి తక్షణ కర్తవ్యం నాడినాడికి రోమరోమానికీ ఎక్కిపోయింది.

డేదర్ హృదయం కదిలించి. పవిత్ర యుగోస్లేవియా దేశాన్ని స్మరించాడు. దేశరక్షణకు ఫాసిస్టు మూకలను నరకడం ఎంత అవసరమో, ప్రధాన కర్తవ్యమో, ఓల్గా చేతినికూడా ఆదేశరక్షణకోసరం, ఆ స్వతంత్ర సంపాదనకోసరం, నరకడం ప్రధానకర్తవ్యంగా తలుస్తానన్నాడు. 'జై స్వతంత్ర యుగోస్లేవియాకు జై' అన్నాడు. ఊచకోతగోసినట్లు జాతరలో శక్తికి తలనరికినట్లు ఓల్గా చేయినరికి వేశాడు. ఓల్గా అమ్మా అనలేదు. ఉస్సుమనలేదు. కంట తడిబెట్టలేదు. స్వతంత్ర యుగోస్లేవియా వర్థిల్లా

లనే కేకతో తన బాధనంతా ఓర్చుకో గలిగింది. నవ్వుతూ ఇక కట్టు కట్టండి అంది. కాని ఈ యుద్ధ సమయంలో శత్రువులదాడికి ఉరకలుతీసి పరువులెత్తి ఎదుర్కోవలసిన సమయంలో, దేశభక్తులకు బలంగా నుండ వలసిన తాను, భారమై పోతినేయని పరితపించింది. కట్టు కట్టారు, మరి రెండు చొక్కాలు చింపి. మరల అరగంటలో బయలుదేర వలసివచ్చింది.

ఈ లోగా ఒక గుర్రం లభించింది. దానిపై ఓల్గాను ఎక్కించారు. దేదర్ వెంట నడువసాగాడు. ఆ ప్రక్క టిటో. ముందు వెనుక చెరియొక కాగితాల మూటతో దేశభక్తులు, అడవులు, తుప్పలు, కొండలలో నడుస్తూ సాయంత్రానికి జనవాస ప్రాంతానికి చేరుతున్నట్లు తోచింది. మిత్రుల నివా సాలు దరిదాపులో కావ్పించ సాగాయి. ఆశ రేకెత్తింది. జనావాసం వద్దకు పంపి మందు తెప్పిద్దాం అని తలచారు. ఒకరిని పంపారు. అక్కడ మాత్రం ఏమున్నవి. శత్రుల దాడులకు విహతం అయిపోయినవి. జారి పోయిన బాపతు రెండు మాత్రలు లభించాయి. చీకటి పడే టప్పటికి తెచ్చారు. ఆ మాత్రలు గుండె నుత్తేజపరచి, నిస్త్రాణ తగ్గించేవి దేదర్ తెచ్చి ఓల్గాకు ఇచ్చాడు. ఈ నరికినచెయ్యికి కట్టిన గుడ్డలన్నీ నెత్తురుముద్ద లయినవి. ధనుర్వాతం అసలు వంటికంతా ఎక్కిపోతున్నది. చేతిదెబ్బలి బాధ తప్పించుకోడానికి నరికించుకుందేగాని త్రాణ లేదు. శరీరం అంతా కంపించి వేస్తున్నది. ఓల్గాకు తాను జీవిస్తాననే ఆశ పోయింది. ఆ ఆపద సమయంలో గుండె నుత్తేజ పరిచే మందు ఎంత అవసరమో ఆమెకు అవ గత మయినట్లు మరెవరికి తెలుసు? తనవలె ఎంతమంది దేశభక్తురాండ్రు, దేశభక్తులు మందులు లేక, కట్టుగుడ్డలు లేక నరితపించవలెనో ఊహిం చింది. చేతికున్న బాధ తప్పించుకోడానికి చేతిని నరికించింది. కాని యిపుడో భుజం తెగినందున ధారాప్రవాహంగా స్రవిస్తున్న రక్తంవల్ల ఒంటికంతటికి ధనుర్వాతం కమ్ముక వస్తూంది తాను జీవిస్తాననే ఆశ తీరిపోయింది.

మాత్ర తీసికోమని దేదర్ ఓల్గాను అడిగాడు. మాత్రపై పుమాసింది. కంటనీరు గ్రహిస్తుంది. మందులేక చచ్చిన దేశభక్తులందరు జ్ఞప్తికివచ్చారు. "ఉండనీయండి ప్రతికేవారికివ్వండి" అంది. టిటో, దేదర్ మిగతా దేశ భక్తులు చకితులై పోయినారు. ప్రాణాలు పోతున్నా పరోపకార చింతనమే,

దేశభక్తే. సొంతలాభం కొంతమానుక-స్వంతలాభం అంతామానుకపోరుగు వాడికి తోడుపడవలె అనుకుంది. దేశమంటే మనుషులోయ్ అని అదర్శంతో చూపింది. ఆ మాత్రలు ఖర్చుపడకుం అవి నష్టపడడమే తప్ప తనను బ్రతికిస్తవనే విశ్వాసంలేదు. అయింది, తన జీవితం చరమదశకు వచ్చింది. ఉంది రెండేమాత్రలు. అయినా అవి ఔషధాగారం అంతపని చేయవచ్చు. తన తోడిదేశభక్తులకు, దేశరక్షణకు బ్రతికిపోరాదే వారికి ఉంచమని ఆదేశించింది.

ఇంకా నడువవలసిఉంది. ఇంతవరకు రెండునెలల పదిరోజులయింది తిండితిని. నెలాపదిరోజులైంది నీరులభించి. నిద్రలేనేలేదు నడుస్తూనే ఉన్నారు. ఓల్గా నడుస్తూనడుస్తూ-గుర్రంపై సాగిపోతున్నారు. ఓల్గాకు ధనుర్వాతం మరీవిస్తరించింది. ఉదయానికి ఓల్గా ప్రాణాలు మిన్నుముట్టినవి. ఇంకా ఓల్గాలేదు. 28 సంవత్సరములు నిండకముందే ఓల్గా తన జాతి రక్షణకు, తన దేశస్వాతంత్ర్యానికి బలి అయింది. దేశభక్తులు దుఃఖిస్తూ కూర్చోవడమా, ఓల్గాను మట్టిచేసి ముందుకు సాగిపోవడమా!

నాజీ రక్కసులకు తృప్తిలేదు. ఇంకా వెంటనంటి వస్తూనేఉన్నారు. అయినా ఆ అదనులోనే ఓల్గాను మట్టిచేయడానికి గోయి త్రవ్వసాగారు. కొంతవరకు అయింది. శవాన్ని గోయిప్రక్కనుంచారు. నాజీమూకలధాటి మరింత తీవ్రమైంది. ఓల్గాశవాన్ని పూడ్చడానికి త్రవ్వినకందకం ఈ దేశభక్తులకు రక్షణస్థానం ఐంది. శవంమీద బాంబులు విరివిగాపడ్డాయి. శవం అంతాచెల్లాచెదరు ఐపోయింది. గోతిలో దేశభక్తులురక్షణ పొందగలిగారు. ప్రాణాలతో ఉండినపుడు మాత్రలు బ్రతకే వారికే ఉంచమన్నది. అంతే కాదు చచ్చికూడా తనశవానికై త్రవ్విన గోతినికూడా బ్రతికేవారికి రక్షణస్థానంచేసి తాను దానికి ఆహూతి అయింది. బీభత్సంచేసి జర్మనులు దాటిపోయారు. దేశభక్తులు కందకంనుండి బయటికివచ్చి ఆ కందకంలో ఆమెను మట్టిచేశారు. దేశ స్వాతంత్ర్య రక్షణకు తన అసువుల నర్పించిన ఓల్గాకు యుగోస్లేవియా దేశభక్తులు విప్లవజోహారులు సమర్పించారు. స్మారక చిహ్నంగా దేశ స్వాతంత్ర్య పతాకంనాటారు. ఓల్గా వీరవనిత 'బ్రతికేవారికే' అని స్వాతంత్ర్య వీరులకుదేశాన్ని సమర్పించింది.

'బ్రతికేవారికే' తలలో, నోటిలో, ఇంటింట కథలుగా, గాధలుగా మారింది. బ్రతికేవారికే దేశం. బ్రతికేవారికే దేశము కావాలంటే తాము సర్వం త్యజించనిది, తాము నిలచి పోరాడందే దేశం నిల్వదు. అందుకై ముందుకు వచ్చి శత్రువుల పరిమార్చ వలెననెడి వీరావేశం దేశం అంతా వివిధ ప్రదేశాల్లో ప్రాకిపోయింది. ఈ ఓల్గా మహాతల్లి వీరత్వాన్ని, సాహసాన్ని, త్యాగాన్ని, ముఖ్యంగా స్త్రీలు తమ మాతృ ఆస్థిగా, తమ గౌరవంగా తమకు ఆదర్శంగా భావించసాగారు. ఓల్గా తల్లి బ్రతికేవారికవి తన తిండివి. తన మందును, తన గోతివి, బ్రతికేవారికే ఇచ్చిపోతే ఇంక చిరకాలం క్షుద్ర జీవులుగా తాము జీవించడమేనా అని స్త్రీ లోకం ఉర్రూతలూగింది దేశరక్షణ, స్వాతంత్ర్య సంపాదన పురుషులు చేస్తే, దానిలో భాగం తీసికోవడంకాదు. దేశరక్షణలో, స్వాతంత్ర్య సంపాదనలో తమదే ముందడుగు. అందుకు ఓల్గానే ఆదర్శంగా పెట్టుకున్నారు. వందలు, వేలుగా నారీలోకం కదిలింది. దేశరక్షణకు మాదీ భారం, అంటూ గెరిల్లాదళాలలో, సైనిక విభాగాలలో, అన్ని రంగాలలో గుంపులు గుంపులుగా వందలకు వందలుగా చేరిపోసాగారు ఈ సంఘటనలు, ఓల్గా త్యాగం దేశాన్నంతా ఉత్తేజపరిచింది. దేశభక్త దళాలలో, వైద్య సేవికలుగా, కర్మాగారాలలో వీరనారీమణులుగా చేరసాగారు. 1944 ప్రారంభంకల్లా సైన్యములో యుగోస్లేవియా దేశభక్త దళాలలో టిటో నాయకత్వాన దేశాన్ని తమ జాతి గౌరవాన్ని రక్షించుకోడానికి నిలిచి పోరాడుతున్న యుగోస్లేవియా సైన్యంలో స్త్రీలే అగ్రగాములు కాగలిగారు. పోరాడేటప్పుడు, తిండిలేనప్పుడు, మందు లేనప్పుడు, వస్త్రం లేనప్పుడు ప్రతి కష్ట సమయంలోనూ ప్రతిస్త్రీ ఓల్గానే ఆదర్శంగా స్మరించేది ప్రపంచ చరిత్రలో నాల్గవ వంతు స్త్రీలు సైనికులుగాచేరి పోరిన చరిత్ర యుగోస్లేవియా స్వతంత్రసమరమే. ఓల్గాపేర ప్రతి స్త్రీ దేశరక్షణకు దీక్ష పూనింది. 'ఓల్గా' అంటే దేశం కోసం ప్రాణాలు బలిదానం యివ్వడంగా అర్థం అయిపోయింది. ఆ పేరు దేశభక్తి చిహ్నం అయిపోయింది. వీర రసావేశం కల్గించివేసింది.

---

# ఏ కై క నా య కు డు

టిటో సైన్యం నిజమైన ప్రజాసైన్యం. రైతు కూలీవర్గమే దాని వెన్నెముక. గెరిల్లా సైన్యంలో చేరడమంటే ఎన్ని కష్టాలు ఎదుర్కోవా లిసివస్తుందో ప్రతి ఒకరికి తెలిసిన విషయమే. మృత్యువు అంటే వారికి భయంలేదు. ఏ తుపాకిగుండుతోనో ఒకేసారి ప్రాణంతీస్తే వాళ్ళ అదృష్ట వంతులన్న మాటే. ఒకేసారి చంపివేయడం ఫాసిస్టుల పనిగాదు కాళ్ళు, చేతులు అంగుళం అంగుళం నరికి చిత్రవధచేస్తారు. పట్టుబడిన గెరిల్లా సైనికుణ్నే కాకుండా అతని తల్లిదండ్రుల్ని అక్కా చెల్లెండ్లని అన్న దమ్ముల్ని సకుటుంబంగా స్నేహితులతో సహా - ఒక్కొక్కప్పుడు అతని స్వగ్రామాన్ని మొత్తానికి మొత్తం ధ్వంసం చేసేస్తారు. అయినా యుగోస్లే వియా దేశభక్తులు వెనుకాడలేదు. జంకూ గొంకూలేకుండా ఉత్సాహంగా ఉల్లాసంగా తండోప తండాలుగావచ్చి టిటో సైన్యంలో చేరారు. కొద్ది రోజుల్లోనే టిటో సైన్యం దాదాపు మూడులక్షలవరకు పెరిగింది. ఒక్క సోవియట్ రష్యాను మినహాయిస్తే యూరోపులో జర్మనీని ఈ విధంగా ఎదిరించిపోరాడిన దేశం మరొకటి లేదు.

గెరిల్లా సైన్యాధిపతులు ప్రజా ఉద్యమాల్లో మొదటినుంచి కాకలు దీరిన మేటి రాజకీయవేత్తలు. స్పెయిన్ అంతర్యుద్ధంలో ఆరితేరిన ఉత్తమ దేశభక్తులు. మిలటరీ విజ్ఞానంతో పాటు తులతూగే రాజకీయ విజ్ఞానం ఉన్నప్పుడే గెరిల్లా ఉద్యమాన్ని జయప్రదంగా నడపగలరు. ప్రజాసేవలో సిద్ధహస్తులై తమకు చిరపరిచితులైన రాజకీయవర్కర్లు నడుపుతూఉన్న సైన్యంలో చేరడానికి ఆ యా ప్రాంతాల్లోని ప్రజలు యెంతో ఉత్సాహంగా ముందుకు వచ్చారు. ధనజనసాధన సంపత్తితో సంపూర్తిగా తోడ్పడ్డారు. సైనికుల్లో, ప్రజల్లో సుహృద్భావ పూరితమైన అవినాభావ సంబంధం ఏర్ప డింది. టిటో విజయాని కిదొక ప్రధాన కారణం.

## జా తీ యై క్య త

రెండో ప్రధాన విషయం జాతీయైక్యత. అన్ని జాతులకు స్వయం నిర్ణయాధికారం ఉంటుంది అని టిటో మొదటినుంచి తీవ్రంగా ప్రచారం



యుద్ధవ్యూహ సమితి ప్రధాని అగు
జనరల్ యోవనోవిచ్‌తో మార్షల్ టిటో

చేశాడు. స్వయంనిర్ణయసూత్రం అంగీకరించడం ద్వారానే జాతీయైక్యత సిద్ధిస్తుందని చెప్పాడు. తదనుకూలంగానే యుగోస్లేవియా స్వాతంత్ర్య పోరాట ప్రణాళిక ప్రకటించాడు. జాతీయశక్తు లన్నిటిమధ్య అభేద్యమైన ఐక్యత సాధించాడు. "మాతృదేశ స్వాతంత్ర్య సంపాదనకోసం పోరాడడమే అన్ని పార్టీల ప్రధాన కర్తవ్యము. స్వాతంత్ర్యం సాధించినతర్వాత ప్రజాస్వామిక హక్కులు నూటికి నూరుపాళ్ళు కాపాడబడుతాయి. ప్రజలు స్వేచ్ఛగా తమ ఇష్టంవచ్చిన పార్టీకి ఓటుచేయవచ్చు." ఈ కార్యక్రమం మీద దేశభక్తులందరు ఐక్యం అయ్యారు. మిహిలోవిచ్‌తోకూడా ఆఖరు నిమిషం వరకు సంప్రతింపులు సాగించాడు. నాజీ రాక్షసుల అడుగులకు మడుగులొత్తే తొత్తుగా తయారైన మిహిలోవిచ్ టిటో సూచనల్ని తోసి పుచ్చాడు. టిటో సూచనలు ఎంత న్యాయ సమ్మతమైనవో, ఎంత ఉదారంగా ఉన్నాయో చూడండి.

## టిటో సూచనలు

1. జర్మనులకు, జర్మన్‌శత్రువులకు అమ్ముడుబోయిన నెడిచ్ సైన్యాలకు వ్యతిరేకంగా రెండు సైన్యాలూ కలిసి ఒక సంయుక్త నాయకత్వం కింద పోరాడుట.
2. రెండు సైన్యాలకు ఆయుధసామగ్రి ఆహారపదార్థాలు సప్లయి చేయుటకు ఒక సంయుక్త సప్లయి కమిటీ.
3. శత్రువునుంచి వశంచేసుకునే సామగ్రి అంతా యుద్ధరంగాల ప్రాముఖ్యతను బట్టి రెండు సైన్యాలకు విభజించుట. అంతా యుద్ధరంగాలకే, అంతా పోరాటానికే వినియోగపడాలి అనే సూత్రాన్ని ఆధారం చేసుకొని ఈ విభజన జరగాలి.
4. వశం గావించుకున్న ప్రదేశాలమీద సంయుక్త అధికారాన్నిస్థాపించుట.
5. ఎక్కడ విభేదాలు వచ్చినప్పటికీ వాటిని ఆలస్యం చేయకుండా వెంటనే పరిష్కరించుటకు సంయుక్త విచారణ కమిటీలు.
6. విముక్తి గావించబడిన ప్రాంతాల్లో ప్రజల ఆహారసప్లయి, ఆర్థిక విధానం యుద్ధ అవసరాల సప్లయి, శాంతిభద్రతలను కాపాడుట,

మొదలైనవన్నీ పాతప్రభుత్వ అఫీసర్ల చేతుల్లోనూ, పాతపోలీసు డిపార్టుమెంటు చేతుల్లోనూ ఉంచకూడదు. ఈ పను లన్నిటిని నిర్వ హించగల తాత్కాలిక సంయుక్త కమిటీలను ఏర్పరచుట అవసరం. పూర్వం పనిచేస్తున్న ఉద్యోగుల్లో, పోలీసుల్లో ఫాసిస్టుల పలుకబడి ఎక్కువగాఉంది. ఎందుకంటె విన్నటివరకూ దేశాన్ని ఆక్రమించిన నాజీలకింద పనిజేస్తున్న వారే ఈ ఉద్యోగులంతా. అందువల్ల యీ పాత అధికారవర్గం ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడడంలో సహాయ పడుతుందని నమ్మడం అసంభవం. అంతే కాకుండా ఈ అధికారవర్గం మీద ప్రజలకు బొత్తిగా నమ్మకంలేదు. అందువల్ల నేడు ప్రజలచే స్థానికంగా ఎన్నుకొనబడుతూ ఉన్న జాతీయ విముక్తి కమిటీలే ఈ పనుల్ని నిర్వహించడం అవసరం. ఈ కమిటీల్ని ప్రజలు స్వేచ్ఛగా ఎన్నుకోవచ్చు. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుటకు సిద్ధమైన వారి నెవరినైనాసరే, వారు ఏ రాజకీయసిద్ధాంతాన్ని బలపర్చి నప్పటికీ, ఎన్నుకోవచ్చు. ఎన్నికలకు వీలులేనప్పుడు వివిధరాజకీయ గ్రూపులన్నీ కలిసి కమిటీలను నియమించవచ్చు.

7. సైన్యంలో చేర్చుకునే టప్పుడు బలాత్కారం పనికిరాదు. బుద్ధిపూర్వ కంగా వారికి ఇష్టంవచ్చిన సైన్యంలో ప్రజలుచేరవచ్చును. చెట్నిక్కుల సైన్యంలో నయినాసరే, లేక గెరిల్లా సైన్యంలో నయినాసరే. ఈ విధంగా స్వేచ్ఛ ఇచ్చినప్పుడు బుద్ధిపూర్వకంగాచేరే సైనికులు మన సారా చివరవరకు పోరాడుతారు.

8. క్రింది దళాలన్నీ కేంద్రనాయకత్వం ఇచ్చే సూచనలను ఆజ్ఞలను పూర్తిగా శిరసా వహిస్తూ పనిచేయాలి.

9. మన ఇద్దరికిగల భేదాల్నిబట్టి, మన రెండు సైనికకేంద్రాలు, వేరువేరు పట్టణాల్లో ఉండడం అవసరం. లేని ఎడల ఒక్కొక్క సమయంలో కలహాలు బయలుదేరవచ్చు. అయితే ప్రతి కేంద్రంలోను, రెండో సైన్యంయొక్క ప్రతినిధిగూడా ఒకరు ఉంటారు.

10. ఫాసిస్టులకు వ్యతిరేకంగా చావుబ్రతుకుల పోరాటాలుచేస్తూ ఉన్న సమయంలో పంచమాంగదళ చర్యల్ని, శత్రుగూఢచారుల్ని వెంటనే

శిక్షించుటకు ఒక సంయుక్త మిలటరీ కోర్టును స్థాపించి నేరస్థుల్ని నిర్దాక్షిణ్యంగా శిక్షించాలి.

11. జాతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని నిరోధించి దేశభక్తుల్ని యెదురొడ్డుతూవున్న చెట్నిక్ సైన్యాల్ని ప్రతిఘటించుట అత్యవసరం. రెండు సైన్యాలు కలిసి ప్రతిఘటించినాసరే లేక ఎవరికో ఒకరికి వదలి పెట్టినాసరే.

12. పట్టుబడిన పంచమాంగదళ చీడపురుగులకు, చెట్నిక్కుల వార్తా పత్రికలనుగానీ, గెరిల్లా వార్తాపత్రికల్నిగానీ ఇవ్వగూడదు. అటువంటి పత్రికలనిస్తూ శత్రువులకు సహాయం చేసేవార్ని మిలటరీకోర్టులో శిక్షించాలి. అనుమానాస్పదులయిన వ్యక్తులందర్నీ వెంటనే అరెస్టు చేసి ఒక సంయుక్త విచారణ కమిటీకింద విచారించాలి.

టిటో పంపిన ఇలాటి దివ్యమైన సూచనల్ని మిహిలోవిచ్ తోసిపుచ్చాడు. దేశద్రోహానికి కలసద్దాడు. హిట్లరు, ముసోలినీల అండ జూచుకొని టిటోమీద కత్తిగట్టాడు. ప్రజలు ఈ దేశద్రోహికి తగినబుద్ధిజెప్పారు. ఇటీవల జరిగిన ఎన్నికల్లో ఈ ప్రబుద్ధుడు ఊరూ పేరూ లేకుండా పొయ్యాడు.

---

# నూతన యుగోస్లేవియా

నాలుగు సంవత్సరాల తీవ్ర యుద్ధాగ్నిలో కాకలదీరి యుగోస్లేవియా నేడొక ఉజ్వల నూతన స్వరూపాన్ని తీసుకుంది. యుగోస్లేవియాను నాశనం చేయడానికి హిట్లరు హోరాహోరీగా యుద్ధం జేసాడు. చివరకు తానే నాశనమయ్యాడు. టిటోను గురించి చర్చిల్ విపరీతమైన

దుష్ప్రచారం చేశాడు. పతన మయ్యాడు. కాని టిటో పలుకుబడి మాత్రం నానాటికి పెరిగిపోతూనేఉంది. టిటో కీర్తి దిగ్దిగంతాల వ్యాపించింది. యుగోస్లేవియా రాజకీయాల్లో టిటోకి ఎంత గొప్పస్థానం ఉందో 11-11-45 వ తేదీన ప్రజాపరిషత్తుకి జరిగిన ఎన్నికలే రుజువుజేశాయి.

## ఎ న్ని క లు

ఎన్నికల్లో టిటోను దెబ్బ గొట్టడానికి అభివృద్ధి విరోధకులు తల్ల కిందుగా తపస్సు చేశారు.

డెమోక్రటిక్ పార్టీ, రాడికల్ పార్టీ, ఫార్మర్స్ పార్టీలు ఎన్నికల్లో పాల్గొన వద్దని ప్రజలకు విజ్ఞప్తి జేశాయి. ( ఈ మూడు పట్టి నామమాత్రా వశిష్టములైన పార్టీలు. జేబు సంఘాలు. వీటివెనక ప్రజలెవరూ లేరు. ) వ్యక్తిగతంగా కొంత గౌరవం సంపాదించుకున్న సుబాసిచ్, సుతేజ్ వగైరా నాయకులు పీపుల్సు ఫ్రంటుకు ( దీనికి టిటో నాయకుడు ) తోడ్పడ నిరాకరించారు.

కేథలిక్ మత గురువులద్వారా కమ్యూనిస్టులు మత వ్యతిరేకులు అని విషప్రచారం గావించారు.

నూతనంగా లభించిన సంపూర్ణ పౌరసత్వ హక్కుల్ని అవకాశంగా తీసికొని అభివృద్ధి విరోధక ముఠా పీపుల్సుఫ్రంటునుగురించి ఎన్నో అభూత కల్పనలు కల్పించింది, ఎంతో దుష్ప్రచారం చేసింది. పీపుల్సు ఫ్రంట్ నాయకులమీద బాంబులు ఉపయోగించే చెట్నిక్కుల్ని తమ పత్రి కల్లో-బహిరంగంగా సమర్థించింది. విదేశీ పెట్టుబడిదార్ల సహాయాన్ని పలుకుబడిని పూర్తిగా ఉపయోగించుకుంది. యుద్ధఫలితంగా ఏర్పడిన ఆహార కరువును ఆధారంగా జేసుకొని దేశమంతటా లూటీలు జరిపి పీపుల్సు ఫ్రంటును అల్లరిపాలు చేయాలని ప్రయత్నించింది. భిన్న భిన్న జాతుల్లో ఆంతరంగిక విభేదాల్ని రెచ్చగొట్టాలని చూసింది. ఎన్ని దొంగ ఎత్తులు ఎత్తినా ప్రజాబలంముందు అవన్నీ తుత్తునియలై పోయాయి.

పీపుల్స్ ఫ్రంట్ సంపూర్ణ పౌరసత్వహక్కుల్ని అమలు పరచింది. వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాల్ని పూర్తిగా కాపాడింది. ఇంతకు పూర్వం

21 సంవత్సరాల వయస్సు మించినవారికే వోటింగ్ హక్కు ఉండేది. ఆ నియమాన్ని రద్దుజేసి 18 సంవత్సరాల వయస్సు మించిన ప్రతివారికి వోటింగ్ హక్కు ఇచ్చింది ఇదివరకు స్త్రీలకు వోటింగ్ అధికారంలేదు. పురుషులతోపాటు సమానంగా స్త్రీలకు కూడా వోట్ చేసే అధికారం కలిగించింది. ఫాసిస్టు పార్టీకి సంబంధించిన వ్యక్తులకు మాత్రం వోటింగ్ అధికారం ఇవ్వలేదు. ఇలాంటి వాళ్ళు మొత్తం వోటర్లలో నూటికి ముగ్గురుంటారు. ప్రజలు తమ అభిప్రాయాన్ని స్వేచ్ఛగా తెలియపరచేందుకు ఎన్నికల్లో రహస్యపద్ధతి (సీక్రెట్ బాలెట్) నమలు జరిపారు. యుగోస్లేవియా ఎన్నికలు చాలా న్యాయంగా సక్రమంగా జరిగాయి అని రాయిటర్ వార్తా సంస్థకూడా అంగీకరించింది. కరుడుగట్టిన సామ్రాజ్య వాదుల మనోభావాల్ని ప్రతిబింబించే లండన్ టైమ్సుపత్రికకూడా ఈ విషయాన్ని ఒప్పుకోక తప్పిందికాదు.

ప్రజలందరూ ఎన్నికల్లో పూర్తిగా పాల్గొన్నారు. మేసిడోనియాలో నూటికి 86 మంది, బోస్నియాలో 95, బెల్గ్రేడ్‌లో 91, జాగ్రెబ్‌లో 92, డాల్‌మేషియాలో 96, సరాజ్‌వోలో 96, మెకోహిజా ప్రాంతంలో 86, వాయివోడినా ప్రాంతంలో నూటికి 92 మంది చొప్పున పాల్గొన్నారు. అనేక ప్రాంతాల్లో నూటికి నూరుమంది పాల్గొన్నారు. అనేక ప్రదేశాల్లో నూటికి నూరువోట్లు పీపుల్స ఫ్రంటుకే వచ్చాయి. ఇంకా సరియైన ఎన్నికల వివరాలు మనకు పూర్తిగా తెలియక పోయినా మొత్తం దేశంలో నూటికి తొంభై మందికిపైగా పీపుల్స ఫ్రంటుకే వోటుచేశారు.

## నూతన రాజ్యాంగ నిర్మాణం

'ఓట్లనుబట్టి సీట్లు' అనే ప్రజాస్వామిక సూత్రాన్ని అమలు పర్చారు. ఇందువల్ల అన్ని పార్టీలకు తమతమ బలాన్నిబట్టి శాసనసభలో ప్రాతినిధ్యం ఏర్పడుతుంది. భౌగోళిక సరిహద్దుల్ని అనుసరించి జరిగే ఎన్నికల ప్రకారం నిజమైన ప్రజాభిప్రాయం వెల్లడిగాదు. ఒక పార్టీకి నూటికి యాభై, మరోపార్టీకి నూటికి నలభై వోట్లువస్తే శాసనసభలో కూడా మొదటిపార్టీకి నూటికి యాభై రెండోపార్టీకి నూటికి నలభై చొప్పున

ప్రాతినిధ్యం ఇవ్వబడుతుంది. ఇది ఒక్కటే సరియైన ప్రజాస్వామిక సూత్రం. ఈ పద్ధతినే టిటో యుగోస్లేవియాలో అమలు జరిపాడు.

అన్ని జాతుల హక్కుల్ని సురక్షితంగా కాపాడేటందుకు రెండు విధములయిన శాసనసభల్ని ఏర్పాటు జేశారు. దేశం మొత్తంమీద ప్రజాభిప్రాయాన్ని వెల్లడించేది మొదటి శాసనసభ. రెండో శాసనసభలో అన్ని జాతులకు సమాన ప్రాతినిధ్యం ఉంటుంది. అల్పసంఖ్యాక జాతికి అధిక సంఖ్యాకజాతికికూడా ఇందులో సమానఅవకాశం ఇవ్వబడుతుంది. మొదటి శాసనసభలో ప్యాసైన ప్రతిబిల్లు రెండో శాసన సభలోకూడా ప్యాసై నప్పుడే చట్టరూపం తీసుకుంటుంది. అనగా ప్రతి విషయాన్ని మొదట ప్రజాబాహుళ్యం అంగీకరించాలి. తర్వాత వివిధ జాతులుకూడా దాన్ని ఒప్పుకోవాలి. ఇలాటి నిజమైన ప్రజాస్వామికంలో జాతివైషమ్యానికి యే మాత్రం తావుండదు. అన్ని జాతుల్లోను మంచి సామరస్యం ఏర్పడుతుంది.

## పునర్నిర్మాణము

యుద్ధ కారణంగా యుగోస్లేవియాదేశం ఎంతో నష్టపడింది. మొత్తం జనాభాలో పదోవంతు ప్రజలు చచ్చిపొయ్యారు. టిటోకికూడా ఒకసారి ప్రమాదకరమైన దెబ్బతగిలింది. ఆర్థిక పరిమాణం పూర్తిగా తల్లక్రిందులయింది. ఒక కోడిగుడ్డు కొనాలంటే తొమ్మిది అణాలు ఇచ్చు కోవాలి. కనీసం అయిదు రూపాయలైనా ఖర్చుచేయనిదే ఒక పూట తిండి గడవదు. ఈలాటి విషమ పరిస్థితుల్లో పునర్నిర్మాణభారం టిటోమీద పడింది. రైతు కార్మిక వర్గాల్లో ఒక నూతన సంచలనం గలిగించాడు. ఒక నూతన స్ఫూర్తి రేకెత్తించాడు. బోల్షివిక్ పోటీతో అత్యుత్సాహంగా రైతు కూలీలు పనిజేశారు. శ్మశానంగా మారిపోయిన అనేక గ్రామాల్ని పునర్నిర్మించారు. పరిశ్రమల్లో అధికోత్పత్తి ఉద్యమాన్నికొనసాగించారు. రైతులకు కూలీలు, కూలీలకు రైతులు తోడ్పడ్డారు. ప్రధాన పరిశ్రమల్ని ప్రభుత్వపరం చేశారు. అత్యంత ప్రధానమైన క్రేకా హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ స్టేషన్ని ఇరవై రోజుల్లో మళ్ళీ యధావిధిగా తయారు జేశారు. గత తొమ్మిదిమాసాల్లో హిట్లరు దాడిచే ధ్వంసమై పోయిన 1700 వంతెనలను

మళ్ళీ తిరిగి కట్టారు. లక్షలకొలది స్వాతంత్ర్య యోధులు తమ ప్రాణాల్ని సైతం బలిపెట్టి సాధించిన ప్రజారాజ్యాన్ని సర్వాంగ సౌష్ఠవంగా చేయ డానికి రైతుకార్మిక వర్గం ఇనుమడించిన ఉత్సాహంతో అహోరాత్రాలు తీవ్రంగా కృషిచేస్తూఉంది.

## వ్య వ సా య ం

టిటో ప్రభుత్వం వ్యవసాయంలో ఎన్నో గొప్ప మార్పుల్ని తెస్తూ ఉంది. 'కష్టపడి దున్నేవాడికే పొలం' అనే సిద్ధాంతాన్ని ఆచరణలో పెడుతూఉంది. రైతుల కష్టార్జితాన్ని దోచుకొని తినే జమీందారీ విధా నాన్ని సమూలంగా నిర్మూలించింది. రైతుల అప్పుభారాన్ని రద్దుజేస్తూ 1945 ఆగస్టులో ఒక చట్టాన్ని ప్యాసుచేసింది. రైతుల అభివృద్ధికి ఎదు రొడ్డే అడ్డంకులన్నిటినీ తొలగించివేసింది. రైతు కష్టార్జితానికి రైతే హక్కుదారు. రైతుల రక్తాన్ని పీల్చే జలగలకు టిటో ప్రభుత్వంలో స్థానంలేదు.

## వి దే శా ం గ నీ తి

ఎన్నో సంవత్సరాలనుంచి యుగోస్లేవియా ప్రజా సామాన్యం వాంఛిస్తూన్న సంపూర్ణ ప్రజాస్వామికం నేటికి వారికి సిద్ధించింది. ప్రజలు కోరుతూఉన్న పద్ధతినే ప్రభుత్వం అవలంబిస్తూఉంది. ఇరుగు పొరుగు దేశాలతో సుహృద్భావపూరితమైన సంబంధాన్ని ఏర్పరచుకుంది. ఒక్క ఫాసిస్టు తొత్తులతోతప్ప సోదర బాల్కన్ రాష్ట్రాలతోను, తదితర ప్రజా ప్రభుత్వాలతోను, సోవియట రష్యాతోను మైత్రిపూర్వకమైన ఒడంబడికల్ని చేసుకుంది. ప్రపంచ రాజకీయాల్లో యుగోస్లేవియా నాయకుడైన టిటో నేడొక ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకున్నాడు.

చిన్నప్పటినుంచి ఇనుమును కరిగించి కొత్త అచ్చులుపోసే ఈ కమ్మరిబిడ్డ నేడు తన మాతృదేశాన్నే ఒక కొత్త అచ్చున పోస్తూఉన్నాడు. పాడి పంటలతో సిరిసంపదలతో నిత్య కల్యాణం పచ్చతోరణంగా కళ కళలాడే నూతన స్వతంత్ర యుగోస్లేవియాను నిర్మిస్తున్నాడు. ఆకలి

మంటల హాహాకారాలు, దేశద్రోహుల కుతంత్రాలు, లంచగొండి విధానం దోపిడి పద్ధతిలేని శాంతి సౌఖ్యాలతో తులతూగే నూతన ప్రపంచ భవన నిర్మాణానికి మరోపునాది రాయివేస్తున్నాడు. సమస్త పీడిత ప్రపంచ ప్రజాపీకానికి ధ్రువతారగా - ఆశా జ్యోతిగా ప్రకాశిస్తున్నాడు. అతని అడుగు జాడల్లో, అతను సూచించిన దివ్యమార్గాన నడవడానికి నేడు కోటాను కోట్ల ప్రజలు నడుంబిగించి సిద్ధమౌతున్నారు. అతన్ని ఒక యోధాన యోధుడుగా భావిస్తున్నారు. స్వాతంత్ర్య వీరుడుగా పూజిస్తున్నారు. యుగోస్లేవియా ప్రజానాయకుడుగా - ఏకైక నాయకుడుగా - ఆ విప్లవ మూర్తిని వేనోళ్ళ కీర్తిస్తున్నారు.



నేషనల్ ప్రెస్, నారాయణగూడ, హైదరాబాదు (దక్కన్.)